జులై 1975



# భారతి

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

వెల: రూపాయి న్నర

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

జులై 1975

సంపుటము : 52 ; సంచిక 7 ;

విడిప్రతిక వెల రూపాయిన్నర

2

# అందరం కలిసి మెలిసి...

దేనికైనా ఒక ప్రణాళిక లేకుంటే కుటుంబంలోనే జరగదే. దేశం మొత్తం మీద ఎలా జరుగుతుంది?

మన రాష్ట్రంలో మొదటి పంచవర్ష ప్రణాళికలో ఖర్చు చేసిన రూ. 97 కోట్లు ఎక్కడ? నాలుగో ప్రణాళికలో ఖర్చుఅయిన రూ.419 కోట్లు ఎక్కడ?

5వ ప్రణాళిక ఖర్చు అంచనా రూ. 1105 కోట్లు, ప్రణాళికా సంఘం మంజూరు చేసింది.

అందరం కలిసిమెలిసి అభివృద్ధి సాధించుకుందాం.

---

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR/107/Advt/75

# విషయానుక్రమణిక

## జులై 1975

# సాక్షి గౌతమి

డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు

'అల వేయేఁడుల నాఁటి నన్నయను ప్రత్యక్షమ్ము కన్గొన్నవా
రిల నేరే విపు డుందురొక్కొ ?' యని యన్వేషించుచుండఁగ, 'నేఁ
గలనోయీ !' యని గౌతమీ ధుని తరంగ ప్రోద్భవద్ధ్వాన సం
కలనన్ బల్కుట తోఁచి యా నది కిటుల్ గావించితిన్ ప్రశ్నమున్.

'నాఁటినుండి, గోదావరీ ! నేఁటిదనుక
జీవనముఁ దాల్చియున్నది యీవ కావ,
నీదరిన నన్నపార్యుండు నిలిచెఁగాన
నడుగుచున్నాఁడ నిన్ను నన్నయ్యఁగూర్చి.'

పర చళుక్యాన్వయ నరపాలమణి కను
    రక్తుఁడుం దత్కుల బ్రాహ్మణుండు
జపములు హోమముల్ సంతతంబును జేయు
    నతుల నిష్ఠా గరిష్ఠాత్మకుండు
బ్రహ్మాండ ముఖ్య సర్వపురాణ సమధిక
    విజ్ఞాన నిరతుఁడై వెలయువాఁడు
ఉభయ భాషలయందు నొప్పారఁ గావ్యముల్
    రచియింపఁగల కవి ప్రాగ్రసరుఁడు

సంహితాభ్యాసుఁడును నిత్యసత్యవచనుఁ
డమల మత్యమరాధిపాధ్యాపకుండు
సుజనుఁడును బ్రాతుఁడును నైన సుకవి 'నన్న
గౌతమీ ! జ్ఞప్తి లేఁడె లోకజ్ఞుఁ డతఁడు.

సాక్షి గౌతమి

వెల్లనౌ దోవతి బిళ్లగోచిగఁ గట్టి
శాటిని బైవల్లెవాటు వైచి
ముండిత మస్తకంబున సుంత శిఖ యుంచి
ఫాలభాగంబున భస్మ మలఁది
అంగుళికిని దర్భ యుంగరంబు ధరించి
యజుతను రుదురాక లలరఁజేసి
పాదయుగ్మంబునఁ బావకోళ్లమరించి
చిన్నారి పోఁగులు చెవులఁదాల్చి

వలపలి కరాన భారతప్రతిని బూని
యన్యకరమున హితుని కరాబ్జ మూని
రాజు నాస్థానికిని గవిరాజు వన్న
పేర్యుఁ డరుగుట భావింతు నమ్మ! నిజమ?

శ్రీమన్నన్నయ భట్టసూరి కవితాశ్రీకిన్ భవద్వేణికిన్
సామాన్యంబులు గౌతమీ! శుచితయున్ స్వాదుత్వగాంభీర్యముల్
భూమ స్వచ్ఛతయున్ రసప్రసరణంబున్ మాధురీ ధుర్య శో
భామేయత్వము—ఏరి కే రొనఁగిరో యవ్వానిఁ జెప్పంగదే!

ప్రాతస్సాయములందు నిత్యమును ద్వద్భవ్యాంబు పూరంబులన్
స్నాతుండై తన కూర్చునెయ్యుఁడగు నా నారాయణుం గూడి సం
ప్రీతిన్ వార్చి యుమామహేశ్వరుల నెమ్మిం గొల్చి తాఁ జల్పెఁడో
నీ తీరమ్ములఁ బంచమశ్రుతిపయిన్ నెయ్యంపుఁ జర్చల్, నదీ?

వ్యాస ముని ప్రణీతమగు పంచమ వేదము భారతంబు మా
బాస రచింపఁబూని ప్రతిభా విలసద్రస బంధురోక్తి శ
య్యా సముదాత్త వైఖరి నహో యని పండితకోటి మెచ్చఁగా
వ్రాసి యొకింత య ట్లతఁ డరణ్యమునన్ విడె నేల, వాహినీ?

వ్యాకరణంబులే దొకటియైనను లేదు నిఘంటువున్ రస
ప్రాకట కావ్య మొండయిన వర్తిలదయ్యెను లక్ష్యభూతమై
చీకిలి మాకిలే యగుచుఁ జీఁకటి నిండిన బాసయం దతం
డే కరణిన్ రచించె నుతికెక్కఁగ నప్పుడు వ్యాస భారతిన్?

పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణు నట్లు తోడుపడెనంట మహాకవి పండితుండు నా
రాయణభట్టు నన్నయకు నాంధ్రిని భారతమున్ రచింప; నా
మ్నాయము దెల్గుసేయుటకు మార్గ్కావి నారొకొ వానిఁ బండితుల్ ?

నన్నపార్యునకును వారాయణాఖ్యుండు
తోడుపడుట చూడఁ దోఁచు నాకు;
అచ్చ తెనుఁగుఁగూడి యల్ల దివ్యుల భాష
యద్వయత్వ మెనసినట్టు లమ్మ !

అమ్మా! గౌతమి ! నన్నపార్యు కథన వ్యాపార దాక్ష్యమ్ము, తత్
సమ్మోద ప్రద కావ్యలక్షణ చమత్కారమ్ములుం జూచి పొ
రమ్మే కానక పొంగిపోయి తొకొ సారస్యంబునం జేసి ? ధ
న్యమ్మయ్యెన్ భవదీయ జీవనము ప్రత్యక్షమ్మ యాలించుటన్.

పారాశర్యుని భారతం బనెడి మేల్ బంగారముం గొంచుఁ దా
సారాలంకృత భావ రత్నముల భాస్వద్దీప్తిఁ దాపించి యొ
ప్పారంగా నొనరించి కావ్యమను రమ్యంబైన హారంబు శృం
గారించెం గద నన్న శిల్పి తనరంగా నాంధ్ర వాగ్దేవతన్ !

అతని కవిత్వమందుఁగల వక్కులు దర్భలు నాశ్రమంబులున్
వితత మఖ ప్రతీతియును వేద సమర్చయు భూసురాళి స
త్కృతియును మౌనిరాణ్మహిమ తీర్థమహాత్త్వము సత్త్వనిష్ఠ; యు
క్కతనన తత్కవిత్వధుని, గౌతమి ! నీవలెఁ బూతమై లగున్.

గోదావాహిని ! యే ముహూర్తమున శంకుస్థాపనం జేసెనో
మాదౌ వాఙ్మయ సౌధరాజమునకున్ మా నన్నపార్యుండు; బల్
వైదగ్ధిన్ గవి సార్వభౌమ కవి సమ్రాట్టుల్ కవి బ్రహ్మ ల
త్యౌదాత్త్యంబున నద్ది యభ్రమును రాయంజేసి రా పిమ్మటన్.

భాసురలీల నాంధ్రమున భారతమున్ రచియించునప్పు డ
బ్జాసన కల్పుఁడైన ప్రథమాంధ్రకవీం దుఁడు నన్నభట్టు త

ద్భాసిత వేదసమ్మితతత పాయని యట్లు రసోచితత్వ వి
న్యాసముఁ జూపఁ జూచి ముదితాత్ముఁడు వ్యాసుఁడు శీర్షమూఁపఁడే !

ఇల నీ వెన్నాళ్లుందువో
అల నన్నయ కవిత గూడ నన్నాళ్లును భా
సిలుఁగాదె తెలుఁగుఁ బొలములఁ
బొలుపుగ సుకవిత్వ సస్యములు పండంగన్.

అవును గాని నిన్ను నడిగెద నొక రెండు
ప్రశ్నములను బదులు పలుకుమమ్మ !
అవి చరిత్రకారు లనృతమ్ము లని చెప్పి
రయిన సాక్షివగుట నడుగువాఁడ

కోడలిఁగా నొనర్చుకొనఁగోరి యామెను బెండ్లియాడి, యా
చేడియ లేనిపోని వెవో చెప్పిన, సూను నమాయికున్ దయన్
బాఁడియు వీడి శిక్షకును బాల్పడఁజేసెనె రాజరా జిసీ !
కూడునె యిట్టి పల్కు 'లిదిగోఁ బులి నా, నదె తోఁక'యన్నటుల్ ?

కూడదు నాక పల్కుదురు కొందఱు నన్నయఁగూర్చియుం గటా !
బూడిదచేసె నన్య కవి పుంగవ కావ్యము లీసుమై నటం;
చీడిత సత్యసంధుఁడు కవీంద్రుఁడు సజ్జనుఁ డాహితాగ్ని యౌ
వాఁ డటు చేసెనన్న మది వందురుదున్ గను లీవు నిండఁగా.

ఆ వితథ వార్త లడుగుటఁ
గావలయును నీవు మిపులఁ గలఁగి సుడులుగా
న్నై వాకొనఁజాలక చిం
తా వారాంనిధిని మునిఁగి తరలెద వయ్యో !

---

# లెంక యన్న నర్థమేమి?

డా. నేలటూరు వేంకటరమణయ్య

ప్రకృతము వ్యవహారమున నంతరించిపోయి, గ్రంథస్థములు మాత్రమేయైన కొన్ని ప్రాంత తెలుగు పదములవలన కొన్ని చరిత్ర విశేషములు బైటపడుట కలదు. ఇట్టి పదములలో లెంక యొకటి. దీనివలన ఆంధ్ర దేశమున పూర్వము బానిస వ్యాపార ముండెనో లేదో తెలిసికొనుటకు కొంత వీలగునని తోచుచున్నది.

'లెంక' యన్న పదము క్రీ. శ. 13, 14–వ శతాబ్దముల యందు వ్యవహార భాషలో ప్రచారమున నుండి తరువాత కాలక్రమమున నుత్సన్నమైనది. ఈ పదము అప్పటి వాఙ్మయమున తరచుగా గానవచ్చుచున్నది. మఱియును కాకతియుగ శాసనములందు లెంకాంకితులగు పురుషులనేకులు పేర్కొనబడి యున్నారు. ఉ: మాచయ లెంక, సోమయ లెంక, జుట్టయ లెంక ఇత్యాది.

'లెంక' యనుమాట కర్థమేమి? భటుడు, సేవకుడు అని నిఘంటు కారు లర్థనిర్వచనము గావించియున్నారు కాని ఈ యర్థము 'లెంక' శబ్ద స్వభావమును విశదము చేయదు. 'లెంక'కు భృత్యుడు. భటుడను సామాన్యార్థము వచించిన దాని విశిష్టార్థము వెల్లడి కాదు. కావున 'లెంక' శబ్దార్థవిచారము కొంత యవసరమగుచున్నది. ఈ శబ్ద ముత్పన్న మగుటచేత తదర్థమును నిర్ణయించుటకు దగిన సాధనములు ప్రాచీన ప్రయోగములే. ప్రాచీన గ్రంథముల యందు లభ్యములగు ప్రయోగములమూలమున దీని వాస్తవార్థము గ్రహించ వలసియున్నది.

లెంకగ నేలుకోఁ గలదులే మగనిందరి తీపు చేసి' అను ప్రయోగ మొకటి విజయవిలాసము (3;34) లో గాన వచ్చుచున్నది. కాని ఈ ప్రయోగము లెంక శబ్దార్థ నిర్ణయమునకు అంతగా ననుకూలించదు 'ఏలుకొను' అను క్రియ లెంకకు భృత్యుడను నర్థమును సూచించుచున్నది. 'ఏలుకొను' క్రియకు కర్త 'పారసలోచన' లేక 'సుభద్ర'యని తెచ్చిపెట్టుకొనవలయును. 'ఏలుకొనుట' చేత పారసలోచన లేక సుభద్ర ప్రభ్వి. 'మగడు' ఈ క్రియకు కర్మ. ఏలబడినవాడు, మగడు – అగుట చేత అతడు పారసలోచన యధికారమునకు లొంగినవాడు, పనివాడు, సేవకుడు. లెంక శబ్దమునకు రామాభ్యుదయమునందు ప్రయోగాంతర మొకటి గాన్పించుచున్నది.

క. అవసర మక్కఱలం గై
దువు కర్తములందు వేఁట తోఁటలయందున్
దవులైన పాతలెంకల
మవుటన్ మముఁ జూడు మోపినపుడెపుడైనన్.

ఈ ప్రయోగము లెంకార్థ నిర్ణయమున కత్యంతోపయుక్తమైనది. ఇందువల్ల అవసరము, అక్కఱ, కైదువు, కర్తము, వేట, తోటలయందు లెంకలు ప్రభువునకు దవులై నెరవేర్చు సేవా స్వభావము కొంత తెలియు చున్నది.

1. 'అవసరము' అనగా 'వేళ,' 'కురియుట' 'మంత్ర విశేషము' అను మూడర్థములను శబ్దరత్నాకర కారులు వ్రాసినారు. సూర్యారాయమున ఇంకను కొన్ని యర్థము లగపడుచున్నవి. అందు ముఖ్యమైనది 'కార్యోచిత సమయము' 'అవసరము వారు' అనుమాట క్రింద 'సమయము నెఱింగించు వారు; రాజ ద్వారపాలకులు' అను రెండు అర్థములు గాన్పించుచున్నవి. కావున లెంకలు రాజమందిరమున వసించుచు రాజునకు సమయోచిత కార్యముల నెఱింగించెడి వారని మనము గ్రహించ వచ్చును.

అవసరము వారు రాజద్వారపాలకులని సూర్యరాయ నిఘంటు కారులు వ్రాసిరి. ఇది తప్పు. 'అవసరముల వారు' 'ద్వారపాలకులు' గారు. ద్వారపాలకులు వాకిటివారు. అవసరముల వారును, వాకిటి వారును ఊడిగముల వారేయైనను వారి నియమిత కృత్యములు వేర్వేరు. ఈ విషయము తిరువెంగళ నాథుని ఈ క్రింది ద్విపదల వల్ల తెల్లమగుచున్నది.

నీకు లోకములోని నృపులకుంబోలె
వాకిటి కావలి వారి కట్టడయొ
యొక మంత్రి యాజ్ఞయొ యొక యవసరమొ
యొక రాయసమొ యెద్దియొ నొల్ల నెపుడు
పర. అ. 3.

ఇచ్చట తిరువెంగళనాథుడు వాకిటి కావలి వారిని, అవసరము వారిని వేర్వేరుగ బేర్కొనియుంటచేత అవసరముల వారు ద్వారపాలకులు గారనుట స్పష్టము. 'అవసర' మన 'వేళ' యని బ. సీతారామాచార్యులు అర్థము వ్రాసిరని చెప్పి యుంటిమిగదా. ఇది ఈ మాటకు ముఖ్యార్థము. పూర్వము మన హిందూరాజులు వారొనర్చిన దినకృత్యములయందొక్కొక్క దానిని చేయుటకును నొక కాలమును నిర్ణయించుకొని యా నిర్ణీత కాలక్రమమున దమ దినచర్యను నడుపుచుండువారు (చూ. ఆముక్త: ఆ. 4) ఒక్కొక్క కార్యమును జేయుటకు నిర్ణయించిన వేళ యాసన్నమైనప్పుడు దానిని ఏలిన వానికి దెలుపుటకై కొందఱూడిగము వారు నియమితులై యుండెడివారు. చూడుడు.

జననాథుఁడపుడు మజ్జన భోజనాదు
లొనరించి నగరిలో నొక కొంత తడవు
పవళించి యుండి యుప్పవడమై చెంత
నవసరంబులవారలపుడు కొల్వునకు
వేళయయ్యె నటంచు విన్నవించుటయు. - పర. ఆ. 3.

నవలాలిత యౌవనలగు
నవలా లంతఃపురంబున వెడలి దేవా
యవధారు జలకమున కిది
యవసర మనుటయు నతండు నంగీకృతితోన్
— సాం. 2—37

రయమున నిట్టు రానవసరంబుల వారెదురేగి కొల్వువే
ళయనుచుఁ దెల్పి యుక్తవిధులన్ సముఖంబునఁ జేరి కానుకల్
శయములఁ గూర్చి నమ్రములయి, చక్రధరుంబొడగాంచి
యుంచి తత్
ప్రియముల నర్మపీఠముల, శ్రీకరలీల వసించి రత్తఱిన్ !!
— లక్ష్మీ న. 5: 7.

పైనుదాహృత పద్యముల వల్ల అవసరముల వారు ప్రభువునకు దినకృత్యములు నడుపుటకు తత్తదుచిత కాలంబులను దెల్పుటయే గాక రాజదర్శనార్థులై వచ్చువారలకు రాజంగీకరించు వేళ యెద్దియో, రాజాశ్రితుల కొలువువేళ యెప్పుడో దెల్పుచుండు వారని వ్యక్తమగు చున్నది. తత్కారణమున వాకిటి వారు (ద్వారపాలకులు) అవసరము వారిని అడిగి తగువేళల నెఱింగి రాజదర్శనార్థ మేతెంచిన వారిని నగరిలోకి విడిచెడి వారు.

వారలఁ జూచి తద్ద్వారపాలకులు
కేలి దండముల వాకిటి వడ్డగించి
వేళ గుప్పన నూది నిలు నిలుండనుచు
గుదిచి మూఁపుల వారు కోలలుపూన్చి
బెదర నూరక ఝళిపించి యిట్టనిరి
అవసరంబుల వారి నడుగక వలికి
నవసరం బిపు డెద్దియని మనంబునను
అరయక యెపుడైన నపుడె లోఁ జొచ్చి
యరెగెద రేమని యనవచ్చు మిమ్ము. — పర. ఆ. 3.

అవసరముల వారి నడిగిన, వారు అవసరమో కాదో తెల్పెడి వారలు.

సీ. పొడగనవచ్చు నావృత్తల వేళ గాదంచు
నవసరంబుల వార లడగింప. — కువ. 4.101

మఱియును రాజు అంతిపురము నందున్నప్పుడు రాజదర్శనార్థము గొప్పవారెవ్వరేని వచ్చినను, రాజునకు తక్షణ మెఱుక పఱచవలసిన విషయము లుండిన నరసి పోయి రాజునకు నివేదించవలసిన బాధ్యతయు గూడా అవసరములవారియందుండెను.

"విచ్చేసి యుండి రా వృత్తాంత మెల్ల
నచ్చట నవసరం బరయు చేడియలు
ఇరవొంద నీ కార్య మెఱిగింపకున్న
వరునిచే వడి నాజ్ఞవచ్చుఁ బొమ్మనుచు" — పర. ఆ. 3.

కావున రామాభ్యుదయమున జెప్పిన రీతిని లెంకలు రాజానువర్తులై నిర్ణీత క్రమమున నాతడొనర్పవలసిన నిత్య కృత్యముల యవసరములను దెల్పుచు నుండెడి వారు.

2. ఇక లెంక లొనర్చు కార్యములలో రెండవదగు 'అక్కఱ'

యననేమియో విచారించవలసియున్నది. దీనికి శబ్ద రత్నాకరమున 'అపేక్ష,' 'అవశ్యకార్యము' అను రెండర్థములు చెప్పబడియున్నవి. సూర్యరాయ నిఘంటు కారులు 'కొఱత' లేదు. భావి పరిశోధనలవల్ల దాని స్వభావము బైలుపడవచ్చును.

మఱియు రామాభ్యుదయమున బేర్కొనబడిన లెంకల ఇతర కృత్యములగు 'ఆయుధ కర్మము' (యుద్ధము), వేట, తోట (వన విహారము)లను గూర్చి విస్తరించవలసిన యవసరము లేదు. ఈ కృత్యములు సులభ గ్రాహ్యములు.

ఇంతవఱకును లెంకలు స్వవృత్త్యనుగుణముగ నొనర్చు కార్యములను సాధ్యమైనంత వఱకును నిరూపించితిని. ఇక సంఘము నందు లెంకల స్థానమెద్దియో, వారికి జెల్లుచుండిన మర్యాద యెట్టిదియో కనుగొన ప్రయత్నము సల్పెదను. ఈ విషయమై పాల్కురికి సోమన తన పండితారాధ్య చరిత యందు కొంత దెల్పి యున్నాడు.

మహి ధవళేశు నా మయ్యగా రంద
సహజైకలింగ నిష్ఠా వృత్తి నడువఁ
దనతోడి లెంకలు గని యసహ్యమునఁ
జని యుదయా వనీశ్వర నీదు పెద్ద
లెంక నా మన మిమ్ము లెక్క సేయండు
కొంకక పెట్టించు కేనియు మీ తమ్మ
పొరంగ వైచును భక్తుండ ననుచు.

లెంక నామన భక్తి బింకంబు లుడుగు
కొంకకు మీ సారెకును దప్పవట్ట
రా యింద కో తమ్మ రతి నొల్లవేని
మా యొడల్ మా కిమ్మ మాటలే లనుఁడు,

ఈ ద్విపదలవలన లెంకను గూర్చి మూడు విషయములు వ్యక్తపడుచున్నవి.

(1) లెంక స్వతంత్ర జీవిగాడు. వానికి దనదేహము పై గూడ నధికారము లేదు. అతడు అంగ విక్రయ మొనర్చు కొనుటవలన (చూ. క్రింద) అతని దేహము విలిచిన యొడయుని సొమ్మగు చున్నది. అందువల్ల నాతడు పరాధీనుడుగాని స్వాధీనుడు గాడు.

(2) తత్కారణమున నొడయ డెట్టికార్యము నొనర్పవలెనని కోరినను సమ్మతించవలయును. 'రా, యింద, కోతమ్మ' యన్నను కొనవ యును. విగ్రహించరాదు.

(3) ఒడయుడు విల్చిపుచ్చుకొనిన లెంకని శరీరమును ఒడయ డేమేనియు జేయవచ్చును. 'మా యొడల్ మా కిమ్మ' అని తర్జించి కొనవచ్చును.

ఈ పైనుడివిన విశేషములవలన పూర్వము మనదేశమున మనుష్యుల నమ్మటయు, కొనుటయు జరుగుచుండెననియు, అట్టి బానిసలకు 'లెంక' యను పదము చెలు చుండెననియు విశదమగుచున్నది.

కాని లెంక యొనర్చు సర్వకర్మలకును నొడయుడు పతియా? ఐహిక కర్మలకతడు పతియని యందఱును ఒప్పుకొనిరి. దీని పట్ల సందేహమునకువిడములేదు ఆముష్మికకర్మలనుగూడా పతియాఅనువిషయము వివాదగ్రస్తము. ఆముష్మిక కర్మలపై నొడయని కధికారము లేదని వాదించి వీరశైవులు దప్పించుకొన ప్రయత్నము సల్పిరి. వీరశైవ వాదము ను పాల్కురికి సోమన ఇట్లు విశద పఱచుచున్నాడు:

అమ్మహీశుఁడు నాపు రమ్మని పిలిచి
కొమ్మిచ్చటన యంచుఁ దమ్మ వెట్టుడును
తమ్మ భూవిభుఁ యొద్దనె పారవైచి
తగవగు సేవక ధర్మంబు దలఁప
యొగిఁ దమ్మకైన చె య్యొగనె కాక
దగునె కేవల భక్తి ధర్మంబు దలఁప
మొగి ప్రసాదేతరంబునకుఁ జేసాప
నర్పింపఁగా రాదు హరున కే తమ్మ
యర్పితేతరవస్తు వది కొనరాదు
చోళ వాళికిఁ గాక క్రోజీ తలేశ
వేళ వాళికిఁ గర్తవే యెటు లనిన
స్వార్థ జంగమ పూజనార్థ మీ యర్థ
మర్థ సంఘటనార్థమది నీదు సేవ
అరయఁ దత్వేర్థ మంగ విక్రయము
ధరణీశ యటుగాక దన శరీరంబు
నమ్మిన వాఁడగా కాచార నియతి
నమ్మిన వాఁడనే యనవుడు నృపతి- —పండితారాధ్య.

ఇందువల్ల 'సేవక' ధర్మము భక్తి ధర్మముతో విఘటించి నప్పుడు భక్తిధర్మమే యంగీకార్యము అని వీరశైవముల వాదమనుట

తెల్లము. ఒడయడు లెంకని వృత్తిధర్మమున కధికారికాని మత ధర్మమునకు గాదు. ఈ యర్థమునే సోమనాథుడు

చోళ పాళికిఁ గాక క్షోణీతలేశ
వేళపాళికిఁ గర్తవే యెట్లులనిన,

అను ద్విపదయందు బొందుపఱచినాడు. 'చోళపాళి', 'వేళ పాళి' అను పదముల యర్థమును మొదట నిశ్చయించినగాని, వీర శైవుల వాదములోని ధర్మసూక్ష్మము తేటకాజాలదు.

ఈ పదార్థ వివారమును పెక్కు పండితులు గావించి యున్నారు కీ.శే. కె వి లక్ష్మణరావుగారు 'చోళపాళి' యనగ 'చోళ రాజ్యము', వేళపాళి యనగా 'కాలుని రాజ్యము' అని వ్యాఖ్యా నము వ్రాసిరి. ఇది సరియైన యర్థము కాదు. ఏలన ?

1) ఉదయా వనీశు డేలిన రాజ్యమునకు
'చోళపాళి' లని పేరుండినటు నిదర్శన
మెచ్చటను గానరాదు.

2) మఱియు నిమాటలను బసవపురాణమున
చోడల బాచయ్య చరిత్రయందు సోమన
మరః వాడి యున్నాడు.

'ఇప్పర దైవంబు లిండ్లకు నితని
నితని నేల రావన వచ్చువేఉ పతివీవు
చోళ వాళికిఁగాక వేళవాళికిని'.

ఉదయావనీశుడును బాచయ్యయు సమకాలికులు. వారిద్దరు నేకకాలమున నొక్కదేశముపై నధికార మల్పుట పొసగదు. కావున లక్ష్మణరావుగారు చెప్పిన యర్థము సరిపడదు. ఇంతేకాదు. పండితారాధ్య చరిత్రలోని ధవళేశు నామయ్య వృత్తాంతము నంత టిని జదివిన 'చోళపాళి'కి 'చోళ దేశ'మను నర్థము సందర్భోచితము కాదని తోచక పోదు. ఇంక, వేళ పాళికి కాలుని రాజ్యమను నర మప్రశస్తము. కాలుని రాజ్యమునుగూర్చి ప్రస్తావించవలసిన యవసర మిచ్చట కాన్పించదు. మహామహోపాధ్యాయ కీ.శే. ఆర్. నరసింహా చార్యులవారు కర్ణాటక గ్రంథముల యందలి ప్రయోగములను జర్చించి 'చోళపాళి'కి ఋణము', 'విశ్వాసము' అను రెండర్థములను నిర్ణయించినారు. దానిమీదట బ్ర.శ్రీ. వే. ప్రభాకర శాస్త్రులవారు తమ బసవ పురాణ పీఠిక (113 వ పుట) యందు ఇట్లు వ్రాసి యున్నారు.

'ఈ ప్రయోగములఁ జూడగా నాకిట్లర్థము తోచుచున్నది. చోళవాళి= జొన్నలకయిన నిర్ణయము. వేళవాళి – జీవిత కాలమున కైన నిర్ణయము; అనఁగా 'చీతము (తిండికి జొన్నలు) ఇచ్చినందు లకుఁ జేయవలసిన సేవకే నీవధికారివిగాని, జీవితకాల విధానమునకెల్ల నీవధికారివి గావు. వాళి-వతను, ఏర్పాటు, నిర్ణయము. కన్నడమున 'చోళదపాళి' యని యుండుటచేత నది షష్ఠీ సమాసము. ఆ కాల మున రాజసేవకులకు జీతము జొన్నలిచ్చుచుండిరనుటకు నన్నిచోడని ప్రయోగము.

మును మిడి వైరివాహినుల ముట్టి
జొన్నలు గొన్న ఋణంబు నీగుదున్" కుమా.11

'చోళవాళి'కి ప్రభాకరశాస్త్రులవారు చెప్పిన యర్థము చాలవఱకును నంగీకరింపదగినదే; కాని జొన్నలాకాలమున రాజ సేవకుల కందఱికిని జీతమిచ్చుచుండిరనుట వివారణీయమే. చోడల బాచయ్య బిజ్జలుని కొట్టరువుపై నధికారి. అట్టివాడుగూడ జొన్నలు జీతముగ గొను చుండెననుట విశ్వసించదగినదిగా దోచదు. జొన్నరే జీతమనియర్థము చేసుకొనవలసిన యవసరమును లేదు. ఇచ్చట జొన్నలనగా భుక్తి. 'వాని కూడు దిని', 'వాని యుప్పు దిని' యనుచోట్ల 'కూడు' 'ఉప్పు'ల కెట్టి యర్థమో యట్టి యర్థమే జొన్నలకును చెప్పగలదు; అనగా ప్రభువు సొమ్ము ననుభవించుటవల్ల పడిన ఋణము— అని సామాన్యమైన యర్థమును జెప్పకొనవచ్చును.

'వేళపాళి'కి లక్ష్మణరావుగారుగాని, ప్రభాకరశాస్త్రులవారు గాని చెప్పిన యర్థము ఒంగీకరింపదగినవి కావు. పాళి అనగా పాడి' ధర్మము. చోళపాళి-రాజు సొమ్మును దిని ఋణపడిన మనుజుడు. ఆ ఋణ విముక్తి నందుటకై యనుష్ఠించవలసిన ధర్మము; వేళ నడవడిక పద్ధతి. వేళ = సమయము = సిద్ధాంతము = ఆచారము. వేళపాళి = సమయధర్మము; అనగా, చోళవాళికి = సేవాధర్మమునకు నీవధిపతివౌదువు. (ఇచ్చట, 'తగవగు సేవక ధర్మంబు దలప' అను సోమన వాక్యమును స్మరణయందుంచుకొనవలయును.) వేళవాళికి– సమయ ధర్మమునకు నీవెటు ధిపతివి కాగంవు అని పై నుదాహరించిన ద్విపద కర్థము. 'వేళపాళి'నే సోమనాథుడు 'భక్తిధర్మము' అని 'తగునె కేవల భక్తిధర్మ ఋణంబ' అను ద్విపదయందు చెప్పి

యున్నాడు. 'వేళవాళి'కి సమయ ధర్మమే సరియైన యర్థమని ఈ క్రింది ద్విపదలో సోమనాథుడే సూచించియున్నాడు.

ధరణీశ యటుగాక దన శరీరంబు
నమ్మిన వాఁడగా కాచార నియతి
యమ్మిన వాడనే ? .........

వేళ యనగా మతాచారము లేక సిద్ధాంతము అనుటకు తెనుఁగు నందు ప్రయోగాంతరము లేకపోయినను కన్నడమునందు లేకపోలేదు. జీవ సంబోధన యను ప్రాచీన (12వ శతాబ్దము) జైన చంపూ గ్రంథమున నీ క్రింది ప్రయోగము గాన్పించుచున్నది.

"ఎనె శాలిభద్ర నింతెందం— మనమ నొడంబడి సదెవేళె గొండొడం; తనువ నొడంబడి సదె తవం గొండెడం దోషం పుట్టదొ డేగె య్యలక్కుం" ఎనె (మనసొప్పనిది మతాచారము నందు నమ్మికె పుట్టదు అట్లే దేహము అనుకూలము కానిది తపస్సు చక్కగ నడ వదు అని దీని తాత్పర్యము — (జీవ సంబోధన, వ్రాత ప్రతి, పుట—58) *

కావున లెంకల వృత్తిధర్మమునకు వారి యొడయడు పతికాని సమయ ధర్మమునకు కాడని వీరశైవులు వాదించిరి; కాని యందు లకు వీరశైవేతరులొడంబడినట్లు కానరాదు.

ఇట్లు లెంకలు వరవుడు లైనను వారి స్థితి దుర్భరమైనది కాదు. వారు తమ యొడయుల యుచ్ఛిష్టము దిన్ననేమి, మఱియంత కంటె నీచపుపనులు లొనర్చిననేమి, శక్తిసామర్థ్యములు గలవారైన యెడ రాజ్యముననున్న తమ పదవులాక్రమించుకొనుటకు అడ్డంకి యుండెడిది కాదు. లెంకలు

'తమ్మలు వినువారు తమ్మిచ్చువారు
నమ్మిన మంత్రులై నడవెడివారు'

అని సోమనాథుడీ విషయమును విశదీకరించియున్నాఁడు కావున వీరికెట్టి పదవి నందుటకైనను నర్హత కలదు. రాజ మందిరమున నున్నత పదవులయందున్న లెంకలను కొరవి గోవరాజు పేర్కొని యున్నాడు.

'నిజకోశ గృహస్థితుఁడైన లెంక' (సిం.ద్వా—11,87)
'అర్థ గృహస్థితుఁడైన లెంక' (11-92)
'గృహాధ్యక్షుఁడైన లెంక' (12-11)

ఇట్లు లెంకలు రాచనగరి పెత్తన కార్యములందు నియోగించ బడుచుండిరి. రాచనగరిని రాజ్యముబోలి పాలించవలసిన యవసర ముండెడిది. అట్టి యవసరమును రాజు లెంకల మూలముగ దీర్చు కొనెడివాడు. ఇట్లు ఉన్నత పదవులలో నియోగింప బడుట వల్లనే లెంకలు బాహత్తర నియోగములలో జేర్చబడిరి.

'హితులు భృత్యులు పురోహితులును రాజ
సుతులు బండరులు రాహుతులు లెంకలును
ననువీర లాదిగా నఖిల నియోగ
మును గొల్వ నృపతి........." (పండి ప్ర.3)

మఱియును బసవ పురాణమున సోమనాథుడీ నియోగులను నరువది వగలవారి నెన్నుచు వారిలో లెంకలను గూడ జేర్చినాడు.

'లెంక దా మంచయ్య లీల మీనగరి
సుంకీడు కీడు సుంకేశు బంకయ్యగారు'

కాకతీయ రాజుల కాలమున నగరి పెత్తనముననే గాక రాజ్య పాలన యందు నియుక్తులై యుండిన లెంకలు శాసనములయందు పేర్కొనబడియున్నారు. మఱియు రాష్ట్ర సంరక్షణార్థము ప్రతాప రుద్రుడు నియమించిన డెబ్బదేడ్గురు నాయకులలో పెక్కండ్రు లెంక నామధారు లగ పడుచున్నారు. వీరెవ్వరనిన, (1) అన్నమదేవుని లెంక (2) రుట్టి (జుట్టయ) లెంక (3) గోవు లెంక (4) మాచర్ల నాగులెంక (5) కాటమల్లు లెంక (6) మంకుగున్నలెంక (7)పారు వార బ్రహ్మలెంక (8) ఉండవిల్లు లెంక (9) దిట్టకాము లెంక (10) దేగలన్ను లెంక (11) పడిగెము పోచు లెంక (12) బట్టు మాచు లెంక (13) ఉగ్రహిలెంక. వీరియందు (2) కడప జిల్లా

---

*వేళ శబ్దార్థ చర్చా సందర్భమున, మద్రాసు విశ్వవిద్యాలయ కన్నడ జూనియర్ లెక్చరరగు మన్మిత్రులు హెచ్. శేష అయ్యంగారు తమ యొద్దనున్న జీవంధర చరిత్రలోని పై ప్రయోగము నాకు తెలియ పఱచి వ్రాసి యిచ్చిరి. వారికి కృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించుచున్నాను.

శాసనములందును (10) హైదాబాదు శాసనములందును, (11) గుంటూరుజిలా శాసనములయందును బేర్కొనబడియున్నారు.

'మీపెద్ద లెంక' యని పండితారాధ్యచరిత్ర యందుండుట చేత నగరిలోని లెంకల నందఱ నొకపరిపాటిగ జేర్చి వారి శక్తి సామర్థ్యములను, బుద్ధి కౌశల్యములను ననుసరించి పరిపాటియందు వారికి తమ స్థానమును నిర్ణయించుచుండిరని తోచుచున్నది. లెంకలు వివాహము చేసుకొనవచ్చును. ఇతరులవలె వారును భార్యలతో గూడ యొనర్చి సంతానప్రాప్తి బడయవచ్చును. కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున గండికోట దుర్గాధ్యక్షుడై తత్ప్రాంతభూమినేలిన గొంకా రెడ్డి యొక లెంకని పుత్రుడు. ఇతని తండ్రిపేరు జుట్టయలెంక.

లెంక సంతతివారు లెంకలా స్వతంత్రులా? లెంకలు స్వతంత్రులవలె ఆస్తి నార్జించి తమ సంతతికి జెందజేయవచ్చునా? అను విషయములు విచారణీయములే; కాని వానిని గూర్చి చర్చించుటకు దగిన సామగ్రి ఇంకను లభించినదికాదు. భావి పరిశోధన మూలమున వానిని గూర్చి కొంత తెలియవచ్చును.

---

# అనాస్వాదితరసం

## శ్రీ సోమసుందర్

హాయిగా రాత్రి – బాధ్యతారహితంగా
తీయగా ధాత్రి – స్వాప్నిక స్రవంతిగా
శర్వరీ తమస్సుందరంగా బృహద్రాత్రి
అనాస్వాదిత మధురస చషకంగా
అనాఘ్రాత సుమ సురభిళంగా...

విషాద ఘనీభావంలా బహుళపక్ష రోదసి
అనాయాస ముకుళిత నయనాల నీరవద్వారసి
హిమాలయాలు, నీహార మహిమాలయాలు
చిక్కుపడింది కాలం చీకటి ప్రేగుల్లో
మొగ్గ తొడిగింది వెలుగు కలనాదాల తలల్లో...

ఇప్పుడే వేకువ తెలవారింది
ఇప్పుడే చీకటి తెరవాలింది
కాకులగోల ప్రారంభమైంది; చీ
కాకుల గోల ప్రారంభమైంది, ఛీ–
కాకుల గోల...ఆకలి కక్కుర్తి గోల...

ఉషోబాల చేతి రత్నపాత్రికను
నెచ్చెలీ ప్రేమలతో నింపు
వేకువ చషకంలో జీవనహాసాల్ని నింపు
ఆహారాన్వేషణాయాతనలకు మారుగా
ఆనందారామాల మలయపవనాల మేల్కొల్పు!

గర్భదరిద్రుల కనాస్వాదిత మధురసంగా
జీవితం దూరదూరంగా వైదొలగిన
కఠోర ప్రకరణాల కిదే ముగింపు...
ఉషోబాల అందించే రత్నపాత్రికలో...
అక్షయ తోషోత్సవాల కిదే మదింపు...

దయా విరహిత పరాభవాగ్నుల
పిలవకు మీ, ప్రియతమా – ఒద్దు ఒద్దు!
ఈ వేకువ మునివాకిట భావిరుచిర
కిసలయ తోరణాల సుతారంగా కూర్చు...
తూరుపు అందించే జీవన పల్లవిని ఆలపించు!

—:o:—

# శ్రీ భీమేశ్వర పురాణ ప్రబంధము

## డా. కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి

(గత సంచిక తరువాయి)

## IV

ఆంధ్ర భాషా ప్రబంధమునందు శ్రీనాథుడు నిక్షేపించిన కీలకములు రెండు. ఒకటి ప్రౌఢి. రెండు పలుకునుడికారము. అది సంస్కృతము. ఇది తెనుగు. భీమేశ్వర పురాణమున ప్రౌఢిమ కలదు. దానిని పరికించినవారు శ్రీనాథుడు ప్రౌఢిమను సంస్కృత భాషా మూలముగా సంగ్రహించినాడనుచున్నారు. మరియు నందుగల పలుకు నుడికారమును చూచిన వారిది యంతయు ఆంధ్రమయీ వాగ్దేవతా విలసన మనుచున్నారు. రెండును సత్యములే. అందొక్కటియును అరకొఱ మాటలేదు. ఏమనగా ఈ భాషా ప్రబంధమునందలి ఆంధ్రభాష నిజమునకు కర్నాట భాషకదా! ఆంధ్రభాష కర్నాటభాషయగుట యెటు? అసలే అవకాశము లేనిదాని విషయము గనుకనే అవకాశమున్నదనుటకు నిజమనియు చెప్పుచున్నాడు శ్రీనాథుడు. ఎంత నిజమని చెప్పినను ఆంధ్రభాష కర్నాటభాషకాదు. అదివేరు. ఇదివేరు. అవునని, అది నిజమని ఒకమహాకవి నొక్కినప్పుడు అందు చమత్కారముండవలయును. కాని దానిని అయినట్లు కవులు చమత్కారము కొరకే చెప్పుదురు.

కర్నాట భాష ఆంధ్రభాష కాకపోయినను మరొక భాషగా ప్రసిద్ధమై యున్నదికదా! కర్నాట భాషయందు శ్రీనాథునకు ప్రేమ యుండవచ్చును! అందువలన కర్నాటభాషా సంప్రదాయములను తన కావ్యమున ప్రవేశపెటి యుండవచ్చును. ఉండవచ్చునన్నంతవరకు నిజమేకాని—శ్రీనాథుని కవిత్వమందున్న కర్నాట భాషా సంప్రదాయమిదియని నిరూపించినవారు లేరు.* శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు చేసిన ప్రయత్నముకూడ వైరిసమాసములను ఒకటి రెండు లక్షణ విరుద్ధములయిన ప్రయోగములను ప్రదర్శించుటగానే సమాప్తమైనది. ఇది ఆంధ్ర భాషకాదు కర్నాటభాష అని అనిపించుకొనుటకు కావలసినంత కర్నాటభాషా సంప్రదాయములు శ్రీనాథుని కావ్యభాషయందు కలదవి నిరూపించుటకు వీలుకానప్పుడు ఆ వాదమును వదలివేయవలయును.—వదలివేసితిమి.

శ్రీనాథుడు పాకనాటివాడు. పాకనాడంతయు నల రేగటి భూమి. కర్ + నాడు = కరి అనగా నలుపు. కర్నాడనగా నల్లని దేశము. అది పాకనాడు. ఆంధ్రదేశములోని ఇతర ప్రదేశములకు పాకనాటికిని భాషలో మాండలిక భేదములున్నవి. శ్రీనాథుడా మాండలికాభిమానముచేత తనది కర్నాట భాషయని చెప్పుకొన్నాడనియు చెప్పవచ్చును. చెప్పవచ్చుగాని పాకనాటి మాండలికములను నిరూపించి అవి ఆనాటి ఇతర మండలములయందలి కవుల కృతులలో లేవనియు, శ్రీనాథుని కృతులలో కలవనియు ముందు నిరూపింపవలయునుకదా! ఆపని చేయక "ఇక్కడ కర్నాటక భాషాపదమునకు ఆంధ్రమండలాంతర్గత విషయ విభేద స్ఫురిత భాషావిన్యాసమనియే నా తలంపు" అని వ్రాసినను అది సిద్ధాంతముకాదు.*

మరి శ్రీనాథుడు కర్నాటక భాషయని చేసిన చమత్కారమేది? కర్నాట శబ్దము రూఢ్యర్థముచేత కన్నడ భాషను చెప్పుచున్నది. కర్నాట శబ్దము సమాసముకూడ. సిద్ధసమాసము గనుక వ్యుత్పత్తి చెప్పవచ్చును. ఇది యోగలక్షణము. శ్రీనాథుని ప్రయోగమున కర్నాట శబ్దము యోగరూఢము. అనగా దానియందు అర్థాభి

---

*1 శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు. పల్నాటి వీరచరిత్ర పీఠిక.
శ్రీ చిలుకూరి వీరభద్రరావు. ఆంధ్రుల చరిత్ర.
శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు. ఆంధ్రకవుల చరిత్ర
శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి. శృంగారనైషధ పీఠిక.
శ్రీ వేంపరాల సూర్యనారాయణ శాస్త్రి. ఆంధ్ర. సా. ప. పత్రిక 31-3,4

*1. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు. శ్రీనాథుని కవిత్వతత్త్వము. పుటలు 28,31.

వ్యక్తి కనువైన రెండు శక్తులున్నవన్నమాట. రూఢమైనట్లును ప్రవర్తింపక తప్పదు. శ్రీనాథున కుద్దేశ్యము యోగమునందున్నది. యోగమునకు బలమిచ్చి రూఢిని దిగ్మ్రింగుటకు వీలుగా శబ్దమును ప్రయోగించినాడు. ప్రకాశమునకు రాకతప్పని రూఢికి ప్రకరణములో విరోధమును కల్పించుటచేత యోగమును బలవంతముచేసినాడు. ప్రకరణమునకనుకూలముగా ప్రవర్తించి యోగశక్తి కర్ణాట శబ్దము యొక్క రూఢ్యర్థమును మ్రింగివేసినది. కర్ణాట శబ్దమునకు యౌగికార్థము శ్రవణపేయమైనదని యర్థము. మరియు హృదయంగమమైనదని యర్థము. ఇదీ చమత్కారము. ఇదియే ప్రౌఢోక్తి లక్షణము. అసంభవమును, సంభవింపజేసి, సంభవించినదానిని సార్థకముచేయు ప్రతిభాలక్షణమునకే ప్రౌఢియనిపేరు. మరియు నది లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణమువలను, కావ్యమర్మజ్ఞులయిన వారినుండి రహస్యముల నెరుగుటవల్లను, తెలిసిన దానిని నిరంతరముగా అభ్యాసమున పెట్టుటచేతను అది వృద్ధియగుచుండును. ఆంధ్ర భాషకవులకు పౌఢి లక్షణము సంస్కృతమునుండియే రావలయును. మరొక మార్గము లేదు. శ్రీనాథుడు భీమేశ్వర పురాణమును సంభవింపజేసినాడు. తన పాండిత్యముచేత సంస్కృత మహాపురాణ నిర్మాణమునకు దీటుగా రచించినాడు. స్కాంద పురాణములోని కాశీ ఖండమునకు ఇది తీసిపోవునేమో చూచుకొనుడన్నట్లు రచించినాడు. కాశీఖండమునుండి ఇతివృత్తమును గ్రహించుటకు శ్రీనాథుడెంత చేయలేదు. అదంతయును ఆయన ప్రతిభ. అది భీమేశ్వర పురాణమునకు పురాణ ప్రౌఢిని సంతరించినది. దానిని చూచినవారు ఇది సంస్కృతమూల లక్షణలక్షితమే అనుచున్నారు. మరియు సంస్కృత భాషా సాహిత్య సంప్రదాయమూలమైన ప్రౌఢి కావ్యము నిండకలదు. అందులో కర్ణాట భాషాపదమును అట్లు త్రిప్పి ప్రయోగించుట ఒకటి మాత్రమే. ఆంధ్రభాషా కావ్యములయందు సంస్కృతము వలన వచ్చెడు కావ్యశోభకు ప్రౌఢియని పేరు. తెనుగువలన వచ్చెడు కావ్యశోభకు పలుకునుడికారమని పేరు. "ఎవ్వరేమన్న నందుగా కేల కొఱత ?" అది అదే. వ్యుత్పత్తిచేత ప్రౌఢిని అనుభవముచేత పలుకునుడికారమును ఆంధ్రభాషకవులు సంతరించుకొనవలయును. ఒక భాషలోని పలుకు నుడికారము అది మాతృభాషగా కలవారి కవగతమైనట్లు ఆభాషను నేర్చుకొన్నవాళ్లకు కాదు. మాతృభాషయైనంత మాత్రమున పలుకునుడికారము ప్రసన్నముకాదు. దాని నభిమానించిన వారికే అది ప్రసన్నమగును. శ్రీనాథుని స్వస్థాన వేషాభిమానము సామాన్యముకాదు కదా ! ఆ యభిమానముతోనేకదా భీమేశ్వర పురాణమును కల్పించినది ! భీమేశ్వరపురాణముయొక్క ప్రబంధ లక్షణము ప్రౌఢిమీద ఎంత యున్నదో పలుకు నుడికారముమీద అంత కంటె ఎక్కువగా నున్నది. ఆంధ్రభాషయందుగల పలుకు నుడికారముల సుష్ఠు ప్రయోగము భీమేశ్వర పురాణమునందు పుష్కలముగా కలదు.

ఇట్లే అవతారికా పద్యములను నాల్గింటిని విచారించినచో శ్రీనాథుడు పెద్ద అబద్ధము చెప్పినదేమియునులేదు. వాస్తవమును కొంత భంగ్యంతరముగా చెప్పనే చెప్పినాడు. అయినను స్కాంద పురాణాంతర్గతముగా లేని గోదావరీ ఖండమును ఉన్నట్లు చెప్పుట భారతమున ధర్మరాజాడిన అబద్ధమువలె నున్నది. అక్కడ ధర్మరాజుకు స్వార్థమున్నది ఇక్కడ శ్రీనాథునకదే మున్నది ? స్వస్థాన వేషభాషాభిమానమే స్వార్థమైనచో అది యుండదగినదియు కావచ్చును.

## V

ఇట్లు భీమేశ్వర పురాణములు వ్రాయబడుటలో మరొక విశేషము మున్నది. "శ్రీ భీమనాథేశ్వరుం డాయురారోగ్యైశ్వర్యంబులు శాశ్వత మోక్షపదంబును కృపసేయు"నని రెండు ప్రధాన విషయములను—ఇహపరములను—గూర్చి ప్రవర్తించిన గ్రంథమిది. ఆయువు, ఆరోగ్యము, ఐశ్వర్యము—ఇవి జీవునకు ఐహికావసరములు. శాశ్వత మోక్షపదమనగా ప్రకాశ విమర్శశక్తుల ఏకరూపత అది అద్వితీయమైన పరబ్రహ్మ వస్తువు. అది కార్యార్థముగా బహుధా రూపము లెత్తు చున్నది. అట్టి ఒక రూపము ఇంద్రియాధిష్ఠితమై జీవశబ్దముచేత చెప్పబడుచున్నది. జీవులలో మానవులేకదా శ్రేష్ఠులు ! మానవులు మోక్షమును పొందవలయుననగా వారికీ జీవలక్షణము పోవలయును. జీవలక్షణమంతయు కర్మాధీనము. శరీరము లేక జీవునకునికి లేదు. జీవునకు శరీరము కర్మసాధనము జీవుడు తన ఈ శరీరములో మోక్షమును పొందుట కనువైన కర్మను చేయవలయును. శరీర పతనానంతర మయ్యెడు మోక్షమునకు శరీరమును సాధనముగా పట్టుకొని సాధించవలయును. అందువలన సాధన రెండు ప్రయోజ

నముల నుద్దేశించి ప్రవర్తించుచున్నది. సాధనమైన శరీరమునకు జీవుడు ఆయువును పోయవలయును. ఆరోగ్యమును చూడవలయును. భోగమునకు ఐశ్వర్యమును సమకూర్చవలయును. అప్పుడా శరీరము జీవునకు మోక్షమున కుపయోగపడును, మొదటి మూడు విషయములు నాల్గవ దానివైపు చూడనప్పుడు జీవులు సంసారులు చూచినప్పుడు భక్తులు- ఉపాసకులు- జ్ఞానులు ఈ మొదలైన పేర్లతో జీవులు వ్యవహరింపబడుదురు. సంసారులైన జీవులను రక్తులుగా ఉపాసకులుగా జ్ఞానులుగా పరిణమింపజేయుట నుద్దేశించి పురాణేతిహాస రూపమున భారతీయ భాషా వాఙ్మయము ప్రవర్తించినది. ఉద్దిష్టార్థము నుద్దేశించికదా వాఙ్మయమును అధ్యయనముచేయవలసినది? శ్రీనాథుని ఈ పురాణ ప్రబంధము నిర్మింపబడుటలోగల అంతర్యమంత స్పష్టముగా ప్రకటింపబడినది.

సంసారులయిన జీవులను పరిణమింపజేయుటకు కర్మను భక్తిమయముచేసి ఋషులు ప్రదర్శించిరి. భక్తిలో పూర్వభాగము గౌణము. ఉత్తర భాగము ముఖ్యము. ముఖ్యభక్తికి గౌణభక్తి ద్వారము వంటిది. స్మరణ కీర్తన వర్ణనాద్యనేక భేదములతో గౌణభక్తియున్నది. ముఖ్యభక్తి యెప్పుడును ఈశ్వర విషయ కామరాగాఖ్య చిత్తవృత్తి విశేషముగా నుండును. ముఖ్యభక్తిమయమైన చిత్తవృత్తిని నిలబెట్టుటకు గౌణభక్తి సాధనము. ఇదంతయు కర్మరూపము. వాఙ్మయమునందు గౌణభక్తిరూపకర్మకాండ వ్యాఖ్యానింపబడుచున్నది. ముఖ్యముగా పురాణములా పని చేయుచున్నవి. క్షేత్ర, తీర్థ, దేవతా మాహాత్మ్యములను ప్రదర్శించు పురాణ ప్రబంధములన్నియు ఆ పని చేయుచున్నవి. ఆయా రచనలన్నియును కర్మలు చేయక తప్పని జీవులను సంసార కర్మలనుండి తప్పించి గౌణభక్తి కర్మలయందు ప్రవర్తించుటకు ప్రేరకములు కావలయునని వ్రాయబడినవి. ఈ భీమేశ్వర పురాణ ప్రబంధమందుకే వ్రాయబడినది.

సంసార కర్మలనుండి తప్పించుటమాత్రమే కాదు గౌణభక్తికి ప్రయోజనము. అది ముఖ్యభక్తికి ద్వారముగా కూడ కావలయును. సుదూర ప్రదేశములలో దేవతలను తీర్థములను ప్రశంసించి తద్దేవతా కీర్తనమును తత్తీర్థయాత్రాభిగమనమును ప్రేరేపించుటయైన తరువాత గౌణభక్తి ముఖ్యభక్తికి ద్వారమగుటకు ఆ దేవతలను ఆ తీర్థములను ఆ క్షేత్రములను సమీప భూములయందు చూపించుచున్నది. దూర దేశస్థములకంటె సమీప దేశస్థములు తక్కువకావు సరికదా అంతకంటెను శ్రేష్ఠములనియు గౌణభక్తి నిరూపించి ముఖ్యభక్తికి పరిణామమును కల్పించుచున్నది. ఈశ్వర విషయ కామరాగాఖ్య చిత్తవృత్తి విశేషము క్రమముగా జ్ఞానరూపమును పొందును. అప్పుడు సమీప దేశస్థములుగా చెప్పబడి ఆ దేవతలు, ఆ తీర్థములు, ఆ క్షేత్రములు సమస్తమును తన శరీరమునందే యున్నట్లును, అంతకంటెను ఇవియే శ్రేష్ఠములయినట్లును కన్పించును క్రమముగా సమస్తమును తానే అనియు తనను మించినది ఏమియు లేదనియు తెలిసికొన్నమీదట జీవుడు బ్రహ్మయగుచున్నాడు.

జీవుని ఈ పరిణామమునకు దోహదము చేయుటలో శ్రీనాథుడు రచించిన ఈ పురాణ ప్రబంధము తైత్తిరీయమునందలి మనోమయ కోశనిరూపణముగా నున్నది. సంసార రూపమైన అన్నమయకోశము నుండి పురాణ వాఙ్మయము జీవులను అఖిల దేవతారూపమైన ప్రాణమయ కోశమునకు సముద్ధరించినది. ఆ లెక్కలో కాశీఖండము ప్రాణమయ కోశము. దానినిబట్టి మనోమయ కోశముగా భీమేశ్వర పురాణమును నిర్మించినాడు. జీవజనోద్ధరణ కార్యక్రమములో ఇది యొక మెట్టు. శ్రీనాథుడు తన బుద్ధి వైభవముచేత స్వస్థాన వేష భాషాభిమానము కలిగి స్వజనముయొక్క శాశ్వత మోక్ష పదవీ మార్గమున తానొక దివ్య సోపానమును నిర్మించినాడు.

తైత్తిరీయానందవల్లి మనస్సునలేనిచో కాశిని కాదన్నట్లు అక్కడి సమస్తమును తెచ్చి దక్షారామములో ప్రదర్శింప నేల ? తాను కాశిని కాదన్నట్లు మరొకడు వచ్చి దక్షారామమును కాదన రాదా ? అనవచ్చును. అనవలయునుకూడ. అన్నవాడు—దక్షారామములోని సమస్తమును మరొకచోట చూపింపవలయును. అది విజ్ఞానమయకోశ ప్రదర్శనము. అంతవరకేకాదు ఆపైనగల ఆనందమయ కోశముదాక చూచియే శ్రీనాథుడు మనోమయ కోశముగా తన పురాణ ప్రబంధమును నిర్మించినాడు.

మనోమయముగా పురాణప్రబంధము నిర్మింపబడినదన్న దాని యర్థమేమి ? మనస్సనగా కొంత ఇంద్రియము. కొంతకాదు. అది సంకల్ప వికల్ప రూపము. ఇంద్రియ లక్షణ లక్షితము కాని మనస్సు

యొక్క సంకల్పమునకు వికల్పము లేదు. ఈ సమస్త సృష్టికిని వికల్పములేని సంకల్పమే మూలము. సంకల్పమట్లు చేయగలిగినచో అంతయును అట్లేయగును. దక్షారామము కాశి అని సంకల్పించినచో దక్షారామమే కాశియగును. శ్రీనాథుడు తానట్లు సంకల్పించినాడు. వ్యాసాగస్త్యులు పురాణ పురుషులు సిద్ధ సంకల్పులు కదాయని వారి చేత దక్షారామము కాశికా నగరమునకంటె మిక్కిలియని సంకల్పింప జేసినాడు. దక్షారామము కాశిని మించినది. భీమేశ్వర పురాణ ప్రబంధము మనోమయముగా రచింపబడినదిగా తాదృశమైన మహా సంకల్పమును కేంద్రముగాచేసి దాని పరిణామ ఫలమును ప్రత్యక్షకల్పముగా ప్రదర్శించుమని వ్రాయబడినదని యర్థము. సంకల్పముయొక్క బలమును ఈ ప్రబంధము నిరూపించుచున్నది. సంకల్పములెట్లు వచ్చును: అది దైవాధీనము. దైవమును అనుసంధానము చేసికొనుము. వికల్పములేని సంకల్పములు కలుగుచుండును. వ్యాసాగస్త్యులు ఆత్మానుసంధానము చేసికొన్నవారు. దక్షారామము కాశికా నగరమును మించినదన్న దైవ సంకల్పము వ్యాసాగస్త్యుల ముఖముగా వ్యక్తమైనది. దైవసంకల్పమున్నదని చెప్పుటకే వ్యాసుని శ్రీ అన్నపూర్ణాంబిక దక్షవాటికకు పొమ్మన్నదని శ్రీనాథుడు వ్రాసినాడు. దైవకార్య సముద్ధరణార్థము బయలుదేరి వచ్చిన అగస్త్యుడు దక్షవాటమే మోక్షధామమని అక్కడ స్థావరమేర్పరచుకొనినాడు. అనగా అగస్త్యుడు దక్షారామమునుగూర్చి అట్లు సంకల్పము చేసినాడు. అది అందువలన ఆయన కట్టిదైనది. ఇప్పుడు వ్యాసుడు వచ్చినాడు. వ్యాసునకు దక్షారామమెట్టిదికాదు. ఎందుకనగా వానికా సంకల్పములేదు. అందుకు కారణము వాని మనస్సునకు "విషాదము" పట్టియున్నది. అగస్త్యుడు ముందా విషాదమును తొలగించినాడు. ఆ పిమ్మట వ్యాసునకు "భక్తితృష్ణాతిశయము" కలిగినది. అనగా వాని చిత్తము ఈశ్వరాగమయమైనది. ఆ మనస్సుతో ఆయన "దక్షారామపతి భీమనాథుడు మన పాలికల్పకక్ష్మాజమయ్యె" (3–216) అని ఈ మొదలుగా ఎట్లు సంకల్పించినాడో అదంతయు నట్లే అయినది. అయినట్లు శ్రీనాథుడు తన ఈ పురాణ ప్రబంధమును నిర్మించినాడు. సంకల్పబలమే బలము. అన్నియు దానితో సమకూడి వచ్చును. సంకల్పములకు వికల్పములు లేకుండుటకు దైవానుగ్రహము కావలయును. దైవానుగ్రహప్రాప్తికి భక్తియే సాధనము. భక్తి గౌణ ముఖ్యాఖ్యమై పూర్వోత్తర భాగములుగా నున్నది. ఈ పురాణ ధర్మమును నిరూపించుటకుగాను పురాణ పురుషులయిన వ్యాసాగస్త్యులను పెట్టి శ్రీనాథుడు ఈ ప్రబంధమును నిర్మించినాడు. దీని ప్రబంధ లక్షణము కొంత కథానిర్మాణముమీదను ఎక్కువగా రచనా విశేషముమీదను ఆధారపడియున్నది. వస్తు తాత్పర్యముచేత పురాణమును రచనా విశేషముచేత ప్రబంధమును అయి ఈ పురాణ ప్రబంధమొక విలక్షణ ప్రక్రియగా శ్రీనాథునిచేత ప్రవర్తింపచేయబడినది.

( స మా ప్త ము )



## హైదరాబాదు మీద పరిశ్రమ పొగమబ్బులు

మన రాజధాని నగరం దేశానికి మధ్య భాగంలో వుంది. ప్రభుత్వం చేసే అనేక సౌకర్యాలు, పరపతి, మంచి వాతావరణ పరిస్థితులు — అన్నిటికీ మించి చిరునవ్వులతో ఆహ్వానించే మర్యాదస్తులైన ప్రజలు వున్నారు.

అందుకే ప్రభుత్వ రంగంలో పెద్ద పరిశ్రమలు బి హెచ్ ఇ ఎల్, సింథటిక్ డ్రగ్స్, హెచ్–ఎం–టి, ఇ. సి. ఐ. ఎల్, హెచ్. ఎ. ఎల్. వంటివి యిక్కడ వెలశాయి.

ముందు వెనుకలాలోచిస్తున్న పరిశ్రమదారులను ముద్దుగా ఆహ్వానిస్తుంది హైదరాబాదు నగరం.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR/106/Advt/75

# శిశిర సంధ్య

## శ్రీ గడియారం శేషఫణి శర్మ

శిథిల రాగముల శైశిర నిశా గీతిక
        లేదొ దిక్తటులు ఘోషించు చుండె,
చటుల నిశ్వసన ఝంఝా మరుద్వీచిక
        లేవొ శూన్యమును పూరించుచుండె,
ప్రబల నీరంధ్ర నిర్భర తమః పటిలమ్మ
        లేవొ నల్దెసల వ్యాపించుచుండె,
శంపా వియోగ దుస్సహ తాపతప్తాభ్ర
        మేదొ కన్నీరు వర్షించు చుండె,

    ఇది శిశిర చైత్రసంధి నిండిన తమస్వినీ
    విశీథి, చక్షువులు నిర్నిద్రములుగ
    ఈ రహస్సీమ వేచియుంటిని, వియోగ
    విషమ గీతిక లెడద విన్పించుచుండ !

ఆశలు శ్వాసలై హృదయ
        మంతయు నిండె, తమస్వినీ మనః
కోశము జాగృతమ్మయి,
        నిగూఢ తమః పరిణాహ దైన్యతా
క్రోశము లెల్ల పెల్లుబికె,
        గుండెల జీల్చెడి అశ్రుధారలై,
శైశిర శూన్యఘోషముల,
        సాంద్ర విషాద వియోగ గీతులై !

పలుక నేరదు సఖీ ! ప్రణయార్ద్ర గీతికల్,
    అనల పల్లకి హృదయమ్మునేడు;

చిలుకనేరదు సఖీ ! పులకాశ్రు పూరముల్,
కందోయి తప్తాశ్రు కలశయుగళి;
విలువనేరదు సఖీ ! లలిత వచఃశ్రుతి,
గరళాగ్ని కుండమీ గళమునేడు;
కదల నేరదు సఖీ ! కలితాశు గతుల,
రెక్కలు లేని పక్షి ఈకలను నేడు;

ఈ శిశిర సంధ్య యెద గలంచెడి విషాగ్ని
వీచికలె గుండియలు చీల్చి వీచుగాని,
అలతి నవ్వులపూల తావులు రహించు
పరళ సురభిళ శ్వాస లేశమును లేదు !

ఈ శిశిర సంధ్య కరుడు గట్టిన వియోగ
విస్రుగీతికలే వినిపించుగాని,
దిక్కులందును — ఈ శూన్య దృక్కులందు,
ప్రణయినీ ! ఒక్క మధుర భావనయు లేదు.

ఈ శిశిర సంధ్య నెడద ఘోషించుచున్న
ఈ తమోగీతి నిచయమ్ము నే మహార్క
చైత్ర మాహేంద్రజాల పింఛమ్మునెత్తి
ఏట్టి రసదీప్తి చైత్రీకరింప గలవొ !!

---



# జగన్నాథం

## 'నాగరంజని'

తహసీల్ ఆఫీసునుంచి రెండుమైళ్ళు చచ్చి—చెడి నడిచి యిల్లు చేరగానే తలుపు గడియవేసి ఉండడంతో "సీతా-సీతా" అంటూ కేకేసాను.

'ఆఁ వస్తున్నా—నాన్నా' అంటూ దూరంగా లోపలి గదిలోంచి వినిపించింది సీత కంఠం.

సీత తలుపు తీయడంతోనే చేతిలోని గొడుగు నందుకుంది. ఎండలోంచి ఒక్కసారే నీడలోకి రావడంతో కళ్ళకేమీ కనిపించడం లేదు. చీకటిగా ఉంది.

ఎలాగో ఓలాగు వెళ్ళి చేతులు విరిగిన కుర్చీలో చేరగిల బడ్డాను. ఒకటే ఉక్కగా ఉంది. భుజంమీది కండువాతో ముఖం ఒకసారి గట్టిగా తుడుచుకొని 'అమ్మా సీతా! కాసిన్ని చల్లటి మంచి నీళ్ళు తెచ్చిపెట్టమ్మా." అంటూండగానే మౌనంగా వంటింట్లోకి వెళ్ళింది సీత

'ఇదిగో నాన్నా మజ్జిగ' అన్న సీత గొంతుతో కళ్ళువిప్పి చూశాను. ఎదురుగా సీత ఉదాసీనంగా ఉంది. ఎప్పుడూ చిరునవ్వుతో ఉండే సీత ముఖంలో ఉదాసీనత కొట్టవచ్చినట్లు కనిపించింది.

"ఏమమ్మా! అలా ఉన్నావ్. ఏమయింది. ఊఁ" అని అను నయంగా అడిగాను. కాస్త బతిమాలించుకొని చెప్పింది. "జగ న్నాథం మామయ్య బట్టల కొట్టులోంచి మనిషొచ్చాడు. నానా మాటలు అని పోయాడు. డబ్బులు కట్టలేనివాళ్ళు బట్టలెందుకు తీసుకోవాలి. సీజన్ అంతా అయిపోవచ్చింది. యింకా ఎప్పుడు కడ తారు. అనవసరంగా మమ్మల్ని యింటి చుట్టూ తిప్పించుకొనడం దేనికి...యింకా నానామాటలు అన్నాడు."

సీతకు అభిమానం కాస్త జాస్తి. దాంతో బాధపడుతుంది. "అంతేనా అమ్మా! నేను సాయంత్రం వెళ్లి మామయ్యతో కలుస్తాలే" అన్నాను.

జగన్నాథానికి బట్టల తాలూకు ఐదువందలు, పార్వతి పెళ్ళికి అర్జంటుగా తీసుకున్న వేయిరూపాయలు, యింకా యివ్వనేలేదు. అది తీర్చేమార్గం కనిపించడం లేదు. ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. అప్పు సంగతి ఎలాఉన్నా జగన్నాథాన్ని కలవక చాలా రోజులయింది. వెళ్ళి ఒకసారి కలవాలనిపించింది.

సాయంత్రం ఎండకాస్త చల్లబడింది.

జగన్నాథం తీరిగ్గా కూర్చొని పేపరు చూస్తున్నాడు. "ఏమిటోయ్ యీమధ్య కనిపించడం మానేశావ్. నిన్నసాయంత్రం—యివాళ ప్రొద్దున కూడా మీ యింటికొచ్చాను." అంటూ ఆదరంగా పలకరించాడు.

"నీకు తెలియంది ఏముంది సీజన్‌గా యిది. తహసీల్ వసూలుకై పల్లెటూళ్ళు కెళ్ళాను. నేడే పదిగంటల కొచ్చాను. రావడంతోటే మళ్ళా ఆఫీసు కెళ్ళాను." అంటూ కూర్చున్నాను.

కాస్సేపదీయిదీ మాట్లాడి బాదమ్ మిల్క్‌కు ఆర్డరిచ్చి "అన్నట్లు అసలు విషయం చెప్పడం మరిచాను. మన మందరం కలిసి ఒక టూర్ ప్రోగ్రామ్ వేసుకుందాం. ఆ విషయం అడగటానికే మీ యింటి కొచ్చాను. ఏమంటావ్ ?" అని అడగడంతో, ఏం జవాబు చెప్పాలో తెలియక నవ్వి "మనం ప్రతియేడు అనుకునేదేగా ! బాగానే ఉంటుంది. కాని... అని ఆగిపోయాను."

"కాని ఏమిటోయ్ ! వెళదాం అంటావా. ఆ పురుషోత్తమ్, సుదర్శనం, విశ్వం ఒకటే పోదాం—పోదాం అంటున్నారు. నీవుచెప్పు. నీవు వెళదాం అంటే వెళదాం. లేకపోతే లేదు. నీవు లేకపోతే మా కంత హుషారుగా ఉండదు. అదీగాక మన కారును పదిహేడు వందలు పెట్టి రిపేర్ చేయించాను. ఫస్టుక్లాస్‌గా తయారయింది. దాంట్లోనే వెళదాం. డబ్బుగురించి నీవాలోచించకు. ఏం ?" అంటూ గ్లాస్ అందించాడు.

బాదమ్ మిల్క్ త్రాగుతుంటే ఒకసారి సీత, మధ్యాహ్నం

అన్నమాటలు గుర్తొచ్చాయి. జగన్నాథం ముఖంలోకి పరికించి చూసాను. నిర్మలంగా ఉంది. ఆ మాటలు అతను అనిపించలేదని పించింది. ఎండలో తిరిగి విసిగి వాడే అని ఉంటాడు.

ఎలాగయితేనేం వారంరోజుల తరువాత ఐదుగురం కలసి బయలుదేరాం. నేను, జగన్నాథం, పురుషోత్తం, సుదర్శనం, విశ్వం, డ్రైవర్‌వెంట రావడం వీలు పడలేదు. కారు పాత కాలంది చిన్నది. ఇప్పుడది బాగానే నడుస్తోంది. పోతే కాస్త చప్పుడెక్కువ. అంతే. మొదట మా దర్శనీయ స్థలం అజంతా ఎల్లోరా.

మధ్యాహ్నం వేళకలా 'బీదర్' మీదుగా ఔరంగాబాద్ చేరు కున్నాం. ప్రొద్దున ఎప్పుడు తిన్నామో ఆకలి దంచేస్తుంది. కాస్త పెద్ద హోటల్లోకే దూరబడ్డాం. జగన్నాథం ఏమేమో ఆర్డర్ యిస్తున్నాడు. మటన్, ఫ్రై చికెన్ యింకా ఏమేమో. అందరం తృప్తిగా భోంచేసాం. బిల్లు అరవై ఐదు రూపాయలయింది. బిల్లు జగన్నాథమే తీసుకున్నాడు.

అందరికీ భుక్తాయాసంగా ఉంది. పాన్ నమిలితే బాగుం డనిపించింది. అందరం పాన్‌షాప్‌వైపు కదిలాం.

"పాంచ్‌పాన్ బనావో భై"

పాన్‌షాప్‌వాడు ఒక్కొక్క పాన్‌కట్టి పెడుతున్నాడు పదిలంగా.

'కిత్‌నే పైసే' అడిగాడు జగన్నాథం చిల్లర తీస్తూ.

నలభై పైసలన్నాడు పాన్‌వాలా— అంతే! జగన్నాథంలోని రెండవ మనిషి—నాకింతవరకు అర్థంకాని మనిషి మేల్కొన్నాడు.

"క్యాభై. సాత్‌పైసేకో ఏక్ పాన్ వా ?

"నహీసాబ్! ఆఠ్‌పైసేకో ఏక్-జుమ్‌లా చాలీస్‌పైసే." అంటూ ఐదుపాన్లు అందించాడు.

"కమాల్ హై యార్! నహీహోనా" అంటూ పాన్లు తీసుకోకుండా ముందుకు కదిలాడు.

జగన్నాథంలోని యీ మనస్తత్వమే నాకర్థం కాదు. హోటల్ బిలు అరవయ్యయిదు రూపాయలు చెల్లించిన మనిషి పాన్‌షాప్‌వాడితో ఐదు పైసలకు పేచీ పడ్డాడు.

అరగంట తిరిగి ఒక డొక్కు షాపులో ఏడుపైసల కొకటి చొప్పున పాన్లు తీసుకొని బుగ్గన బిగించాం. అప్పటికే మా భుక్తా యాసం పూర్తిగా తీరిపోయింది.

తెల్లవారి ఎల్లోరాకని మా కారులో బయలుదేరాం. ఊరు దాటుతుంటే కారు ఫెయిలయింది. అది ఎక్కడో ఒకచోట యిలా మధ్యంతరంగా మమ్మల్ని ముంచుతుందని నాకు ముందే తెలుసు. అలా అంటే జగన్నాథం చిన్నబుచ్చుకుంటాడని ఏమీ అనలేదు. ఎలాగో అందరం కలసి దాన్ని మెకానిక్ షాప్‌లో పడేసి మేం బస్సులో ఎల్లోరా బయలుదేరాం.

సాయంత్రం తిరిగొచ్చాక కాలక్షేపం ఎలాచెయ్యాలో తోచక దగ్గర్లో ఉన్న విశ్వేశ్వరుని గుడికి వెళ్ళాం. గుళ్ళోకి వెళ్ళేముందు అందరు పూలు—పండు కొబ్బరికాయ తదితర పూజాసామగ్రి కొన్నాం. పూజ సామాను కొంటుంటే విశ్వం దగ్గర చిల్లరలేదు. జగన్నాథాన్నడిగి రెండు రూపాయల ముప్పై పైసలు అప్పుతీసు కున్నాడు. పక్కలోఉన్న రోల్డ్‌గోల్డ్ నగల దుకాణంలోకి దారి తీశాడు జగన్నాథం. వద్దన్నా వినకుండా సీతకోసమని ఒక నెక్లెస్, నాలుగు గాజులు కొన్నాడు.

అందరం అర్చన చేయించాం. పూజారి హారతి యిస్తుంటే— పళ్ళెంలో చేతికి వచ్చిన నాణెం వేసాం. కాని జగన్నాథం జేబులోని చిల్లర చేతిలోకి తీసుకుని ఏదో నాణెంకోసం వెదుకుతున్నాడు. అతనికి కావలసింది దొరకలేదు. యింకో జేబు వెదికాడు.

జగన్నాథంలో మళ్ళీ నా కర్థంకాని మనిషి మేల్కొన్నాడు.

చివరకు చేతిలోగల చిల్లర మొత్తంలోంచి చిన్న మొత్తం రెండు పైసలు హారతి పళ్ళెంలోవేసి మా అందరికన్న భక్తిగా హారతి కళ్ళ కద్దుకున్నాడు.

గుడి బయట-మెట్లకిరువైపుల బిచ్చగాళ్ళు బారులుతీర్చి హృదయ విదారకంగా అరుస్తున్నారు. ఆ అరుపు వారికి అలవాటయి నట్టుంది. హృదయాలను కదిలించే ఆర్తనాదాలకు ముఖకవళికలకు ఎక్కడా పొత్తు కుదరటంలేదు.

ఒక కుర్రాడు ఒన్లీ నయాపైసలే చిల్లర యిస్తున్నాడు. రూపాయికి తొంభై పైసలు. వాడి దగ్గర చిల్లర తీసుకుని వాళ్లకు

వేశాము. కాని జగన్నాథం చిల్లర తీసికోలేదు. అందరికి వేయడంలేదు. కుంటివారికి, గుడ్డివారికి, పండుముసలి వాళ్ళకి తనకు తోచినన్ని పైసలు వేస్తున్నాడు. మాలాగ చిల్లర పైసా పైసా వేయడంలేదు.

ఒకచోట ఒకడు ముళ్ళకంపలో పడుకొని తలను పూర్తిగా మెడవరకు మట్టితో మెత్తేసుకుని ఛాతీ చరుచుకుంటున్నాడు. వాడి ముందరిపళ్ళెం చిల్లరతో నిండిపోయింది.

నేను ఒక్కక్షణం ఆగిపోయాను. జగన్నాథం కనీసం వీడికి అర్ధరూపాయి బిళ్ళయినా వేస్తాడనిపించి నేను పదిపైసలు వేశాను. నా వెనకనున్న జగన్నాథాన్ని గమనిస్తూ.

నేను అనుకున్నట్టుగా జగన్నాథం అర్ధరూపాయి కాదు గదా ఒక్కపైసా కూడ వేయలేదు.

మరునాటికి కూడ మా కారు రిపేరు అవలేదు.

బస్సులోనే అజంతా వెళ్ళాం. నా ఖర్చులన్నీ జగన్నాథమే భరిస్తున్నాడు. అడపా దడపా అందరి బిల్లూ కడుతున్నాడు.

అజంతా రెండు రోజులు చూసాం.

మా కారు రిపేరయింది. అయినా దాన్నినమ్ముకుని ముందుకు ప్రయాణం చేయాలనిపించలేదు ఎవ్వరికీ. అందుకని వెనక్కి మళ్ళాం.

మిట్టమధ్యాహ్నం—ఒంటిగంటవేళ. ఏప్రిల్ ఎండలు మండిపోతున్నాయి. మా కారుముందు ఓ కుర్రాడు వయస్సు పాతిక ఉండొచ్చు. భుజానికి ఎయిర్‌బాగ్ చేతిలో సూట్‌కేస్‌తో నడుస్తున్నాడు నీరసంగా. జగన్నాథం కారుకాస్త స్లోచేసి కుర్రాడి క్కాస్త ఎడంగా నడిపిస్తూ "ఏమిటోయ్ పగలనుకున్నావా? రాత్రను కున్నావా? లేక వెన్నెల షికారా!"

అంత నీరసంలోను జగన్నాథం మాటలకు చిరునవ్వు నవ్వాడా అబ్బాయి. "వెనక స్టేజీలో ఒక్క బస్సూ ఆగడంలేదు. ప్రొద్దుట్నించి పడిగాపులు కాస్తున్నా. కనీసం ముందర స్టేజిలో నయినా ఆగుతుందేమోనని..." అని అర్ధాంతరంగా ఆగిపోయాడా అబ్బాయి.

జగన్నాథం "కమాన్ కూర్చో" అంటూ తలుపు తెరిచాడు. కుర్రాడు సామాను చేరవేసి—యిరుకుగా ఉన్నా ఎలాగో సర్దుకుని కూర్చున్నాడు.

కుర్రాడు కూర్చున్నది మొదలు ఏదో ఒకటి చెపుతూనే ఉన్నాడు. మూడేళ్ల నిరుద్యోగం తర్వాత అష్టకష్టాలు పడ్డాక ఉద్యోగం దొరికిందట. రేపే వెళ్ళి జాయిన్ అవ్వాలట. యింకా ఏమేమో చెప్పకు పోతున్నాడు.

కుర్రాడు చేరాల్సిన స్టేజీ వచ్చింది.

స్టేజీ దగ్గర మూడు బస్సులకు సరిపడ్డ మంది పడిగాపులు గాస్తున్నారు. జగన్నాథం అక్కడ కారు ఆపలేదు. కుర్రాడ్ని దింపలేదు.

కారు ఒక్కొక్క మైలురాయే దాటుతోంది. మూడు గంటల తర్వాత ఆదిలాబాద 0 కి. మీ. దగ్గర కారు టక్కున ఆగిపోయింది.

"అబ్బాయి ఆదిలాబాదలో దిగాలన్నావ్‌గా వచ్చేసింది" జగన్నాథం గొంతులో దిగు అన్న అర్ధం ధ్వనించింది.

"ఇక్కడెలాగండి దిగేది? యిక్కడ ఓ రిక్షా లేదు. కనీసం కూలివాడు కూడా లేడు. ఎలా వెళ్ళేది ఊళ్ళోకి." అబ్బాయి పూర్తిగా నీరసించిపోయాడు.

"చూడబ్బాయి! ఇది ఆర్. టి. సి. బస్సుకాదు. నీ కారు అంతకన్నాకాదు నీ వనుకున్నచోట దింపటానికి. పెట్రోలు ధరలు అగ్గిలా మండిపోతున్న ఈ రోజుల్లో. కమాన్ తొందరగా దిగు. యింకా మేం ముందుకు పోవాలి."

"ప్లీజ్‌సార్! యింత లగేజ్ మోయలేను. ఏ లాడ్జింగ్ దగ్గరయినా వదిలిపెట్టండి అని దీనంగా అడిగాడు. అయినా జగన్నాథం కాదు కూడదని అక్కడే దింపేసాడు.

నలభై మైళ్ళు లిఫ్టు యిచ్చిన జగన్నాథం ఈ కాస్త దూరం తీసికెళ్ళడానికి ఎందుకంత కఠినంగా ప్రవర్తించాడో అర్ధం కాలేదు నాకు.

కారు మళ్ళీ కదిలింది.

ఒక్కొక్కరినే యిళ్ల దగ్గర దింపుతున్నాడు. విశ్వం యిల్లు వచ్చేసింది. విశ్వం దిగిపోతుంటే విఘ్నేశ్వరాలయం దగ్గర తీసుకున్న చిల్లర జ్ఞాపకం చేయడంతోనే చటుక్కున తీసి యిచ్చేశాడు విశ్వం.

కారు మా యింటి ముందుకి చేరుకుంది. నేను దిగిపోయాను. జగన్నాథం సీతకోసం కొన్న నెక్లెస్ గాజులు తీసియిచ్చాడు. నన్ను కూడ డబ్బడుగుతాడనుకొని జేబులో చేయిపెట్టాను. "జగన్నాథం మామయ్య యిచ్చాడని చెప్పు. వస్తా!" అంటూ కారు స్టార్టు చేసాడు. కారు కనుమరుగైంది

జగన్నాథం విచిత్రమయిన మనిషి.

# దిశల కొనలెల్ల వ్యాపించె తెలుగు కీర్తి

శ్రీ చంద్రాభట్ల సత్యనారాయణమూర్తి

తేనెగుణం తేటదనం
తెలుగు భాష మూలధనం
మృదుపదముల సుధారసం
కద తెలుగు కమోఘ వరం.

కృష్ణవేణి యలల రవళి
గోదారి గభీరసరళి
నాగావళి హొయలు నడక
నా తెలుగున వగలు చిలుకు.

నన్నయ కవి రాజాంకుర
కృష్ణరాయ సంప్రవృద్ధ
తెలుగు వృక్ష సాంద్ర ఛాయ
దిగ్దిగంత పరివ్యాప్తం.

ప్రావృడ్ఘన ఘనదర్శన
పరిఫుల్ల కలాపశిఖీ
నాట్యకేళికా ధ్యానం
నాదు తెలుగు శ్రుతిపేయం.

కోనసీమ సౌందర్యం
కోయిలగళ మాధుర్యం
తిరుపతి వగ ప్రాశస్త్యం
తెలుగు భాష మాహాత్మ్యం.

దిశల కొనలెల వ్యాపించె తెలుగుకీర్తి

గంగాసరితోత్తుంగత
రంగ విశుద్ధాంతరంగ
లాలిత్యం సప్తస్వర
లాస్యం పదవిన్యాసం.

శ్రీశైలపు టౌన్నత్యం
హిమ శీతల సమసౌఖ్యం
తాజా విరి మెత్తదనం
తెలుగు పలుకు నవనీతం

శారదపూర్ణిమ రజనీ
శశికరుణామృత ధారా
స్నిగ్ధ కుముద డళస్ఫుర
తుహిన బిందుసందోహం.

నందనవన పారిజాత
నవమధురస పానమత్త
భృంగరాజ ఝుంకారం
తెలుగు మాటలో సారం.

నీరజరజ సౌగంధం
నీరధి చంద్రుల బంధం
పలుకుల పొందికచందం
తెలుగు భాషలో అందం.

వరవీణా శుభనాదం
వన కీరోత్తూర రావం
మలయ పవనకలస్వనం
తెలుగు కావ్యముల గమకం.

# భారతి

సుందర కవితా నికుంజ
సురుచిర పల్లవ హాసం
దివికే ఒక సోపానం
రసిక జనామృత పానం.

ప్రాచ్యఖండ భాషా సా
మ్రాజ్యల సన్మణి మకుటం
సకల భువన మోహనైక
నభచుంబిత నగశిఖరం

రాయంచల నడకతీరు
శైలోద్భవ ఝురులజోరు
ఆనంద లతికకు నీటు
నా తెలుగున జాలు వారు

విలువగు రతనాల మూట
పరచిన మల్లికల బాట
తరగని భావాల ఊట
తీయని మన తెలుగుమాట.

తెలుగు తల్లిపాల్ద్రావి
తెలుగువాడ నైనందుకు
బ్రతుకంతా గర్విసూ
తెలుగుకీర్తి వినిపిసా.

---



# అందరూ ఒక్కటే

'వెనుకబడితే వెనుకెనోయ్' అన్నాడు మహాకవి గురజాడ.
మనిషి ఎప్పుడూ ముందుకు పోవడానికే ప్రయత్నిస్తాడు.
అది మానవజాతి సహజ లక్షణం.
మనం వెనుకబడి వున్నాం అనే మనస్తత్వంకూడా మంచిదికాదేమో
ఈర్ష్యలకూ స్పర్ధలకు కారణం అవుతుందేమో...
ఆమాటకొస్తే ఎవరు వెనుకబడిలేరు? జిల్లాలోకొన్నిభాగాలు, రాష్ట్రంలో కొన్ని జిల్లాలు, దేశంలో కొన్ని రాష్ట్రాలు, ప్రపంచంలో కొన్ని దేశాలు... వెనుకబడి వున్నాయి. పోల్చిచూసుకుంటే అభివృద్ధిలో తారతమ్యాలు తప్పవు. వీటిని నిగ్రహంతో సవరించుకోవడం కర్తవ్యం.

మన రాష్ట్రంలో కొన్ని వెనుకబడిన ప్రాంతాలు వున్నాయి. దీనికి చారిత్రిక కారణాలు వున్నాయి.

కేంద్ర ప్రభుత్వం మన రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికోసం రు. 90 కోట్లు యిచ్చింది. ఆరు సూత్రాల పథకంలో అదొక ప్రధానాంశం. ఈ మొత్తం ఐదో ప్రణాళికలో తెలంగాణా, రాయలసీమ, కోస్తా ఆంధ్ర ప్రాంతాలలో 5:3:2 నిష్పత్తిలో ఖర్చు చేస్తారు.

తెలంగాణ, రాయలసీమ, కోస్తా ఆంధ్ర అనేవి వ్యవహారం కోసం పెట్టుకున్న పేర్లే. ఎక్కడవున్నా తెలుగువారందరూ ఒక్కటే. ఎక్కడ వెనుకబడినతనం వున్నా అందరూ కలిసి దానిని తొలగించుకోవలసిందే.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు

DIPR No. 267/2 ?/Ad.t 75

# పద్యం, గద్యం, వచన పద్యం, వగైరా

శ్రీ చేకూరి రామారావు

'వచన పద్యం' పద్యమే అనే వ్యాసంతో శ్రీ సంపత్కుమార (సంపత్కుమార 1973) ఒక గడుసైన ప్రశ్న వేశారు. ఒక వ్యాసంలోని వాక్యాలను భావ ఖండాంశాల పద్ధతిలో పాద విభజన చేసి వచన పద్యంగా నిరూపించవచ్చునని నేనన్న దానికి (రామారావు 1972 ) అంగీకరిస్తూనే ఈ కింది విధంగా ప్రశ్నించారు. "మరి సాంప్రదాయిక ఛందస్సులను ననుసరించి వ్యాసాన్ని 26 అక్షరాలుగా (అంతవరకు కూడా) విభజించి విషమ వృత్తాలుగా నిరూపించవచ్చు. ఈ విధంగా ఈ నాటి వచన పద్యాన్ని విషమవృత్తంగా పరిగణించ వచ్చునని ఒక మిత్రుడు సూచించినారు. మరి దీనికి ఏమనాలి?" దీని అర్థం ఏమిటంటే గద్య పద్యాల్ని వేరుచేసే శక్తి భావగణ పద్ధతికి లేని మాట నిజమే అయినా, ప్రాచీన ఛందస్సిద్ధాంతానికి కూడా ఈ అవస్థ తప్పదని. ఇదే నిజమయితే ప్రాచీన ఛందస్సంప్రదాయం ఈ మేరకు లోపభూయిష్ఠం కావాలి. ఏ ఛందస్సిద్ధాంతమైనా గద్య పద్యాల్ని వేరుచెయ్యలేకపోతే, దాని ప్రధానమైన ప్రయోజనమే దెబ్బ తిన్నట్లు. ఈ దృష్ట్యా ప్రాచీన ఛందశ్శాస్త్రాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. ప్రాచీనుల ఛందశ్శాస్త్రాన్ని ఈ కింది పద్ధతిలో ఒక వృత్త నిర్మాణ యంత్రంగా ఊహిస్తున్నాను. ఇట్లాంటి యంత్రాన్ని ఇదే పద్ధతిలో ఊహించారని నా ఉద్దేశం కాదు. వాళ్ళ సిద్ధాంతాన్ని ఈ యంత్రం ద్వారా వివరించటం సాధ్యం అని మాత్రమే. ఇట్లాంటి నిజమైన యంత్రాన్ని నిర్మించవచ్చునని కూడా నా ఉద్దేశం కాదు. ప్రాచీన ఛందస్సిద్ధాంతాన్ని అర్థం చేసుకోటానికి ఈ ఊహాయంత్రం సహాయకారి అని మాత్రమే.

వృత్త నిర్మాణ యంత్రం



ఈ యంత్రంలో పాదోత్పత్తి విభాగం (Line Generator) పాదబంధన విభాగం (Line binder) అనేవి ప్రధాన భాగాలు పాదోత్పత్తి విభాగంలో రెండు అరలున్నై. అందులో ఒకటి అక్షర క్రమాల్ని ఉత్పత్తి చేస్తుంది. రెండోది పాదానికి కొన్ని నియమాలి విధిస్తుంది. ఇటా ఉత్పత్తి అయిన పాదాలను పాదబంధన విభాగం వృత్తాలుగా బంధిస్తుంది. ఈ యంత్రానికి ముడిసరుకు (In put భాషలో వాక్యాలు. చివరికి ఉత్పత్తి అయేవి (Out put) వృత్తాలు జాతులు, ఉపజాతులు, మాత్రాఛందస్సులకు ఈ యంత్రం సరిపోదు అక్షరఛందస్సులకు మాత్రమే ఇది సరిపోతుంది.

అక్షరభేదాల సంఖ్య (గురు, లఘువులు)2. ఇది స్థిరాంకం పాదంలో అక్షరాల సంఖ్య 1నుంచి 26 వరకూ ఉండొచ్చు. 26 అక్షరాలకు మించిన పాదాలున్న లయగ్రాహి (30) లయవిభాతి(34) లయహారి (37) వంటి వృత్తాలను పేర్కొనటాన్నిబట్టి చూస్తే పాదంలో అక్షరాల సంఖ్యమీద గరిష్ఠ పరిమితి విధించటం ప్రాచీనుల ఉద్దేశం కాదని ఊహించవచ్చు. కాని 26 అక్షరాల సంఖ్య వరకు మాత్రమే పేర్లు పెట్టారు. అంతకు ఎక్కువ ఉండటాన్ని వాళ్ళు నిషేధించలేదు. ఒక్కొక్క ఛందస్సులో అక్షరక్రమాల సంఖ్య " **m to the power of n** " అనే గణిత సూత్రం మీద ఆధారపడి ఉంది పాదంలో ఎన్ని అక్షరాలుంటే అన్నిసార్లు అక్షరభేద సంఖ్యను క్రమంగా రెట్టిస్తూపోతే పాదంలో అక్షర క్రమాల సంఖ్య వస్తుంది.అదే ఒక్కొక్క ఛందస్సులో పుట్టే వృత్తాల సంఖ్య. పాదోత్పత్తి విభాగంలో అక్షర క్రమపు అర చేసే పని ఇది. ఈ పద్ధతిలో 26 పాదంలో అక్షరాల గరిష్ఠ సంఖ్య అయితే 1 3 4 2 1 7 7 2 6 అక్షరక్రమాలు (ఇదే మొత్తం సమ వృత్త సంఖ్య కూడా) సాధ్యమవుతై. విషమ వృత్తాలను పరిగణిస్తే ఈ సంఖ్య ఇంకా పెరుగుతుంది.

"ప్రస్తారము వలన ఇన్ని కోట్ల వృత్తము లున్నట్లు తెలిసినను, ప్రయోగములోనున్న మొత్తము వృత్తముల సంఖ్య అత్యల్పము. వంద, వందయేబదికి మించకపోవచ్చును." (సంపత్కుమార 1962). ఈ ప్రయోగంలో ఉన్న 100 లేక 150 పద్యాలకు లక్షణం చెపితే సరిపోయేది గదా! ఇన్ని కోట్ల వృత్తాలను అనవసరంగా పుట్టించటం ఎందుకు అనే సందేహం రావటం సహజం. ఉన్న పద్యాలకు లక్షణం చెప్పటం పరిమిత లక్ష్యం. భాషలో ఇన్ ప్రిన్సిపల్ సాధ్యమయిన వృత్తాలన్నిటికీ ఆటోమేటిక్‌గా లక్షణ నిర్వచనం చేసే యంత్రంగా ప్రాచీన ఛందఃకారులు ఛందశ్శాస్త్రాన్ని పరిగణించారు. దీన్నే ఆల్గోరిదమ్ (algorithem) అంటారు. ఈ లక్ష్యం వ్యాకరణ శాస్త్రం(భాషా శాస్త్రమన్నా సరే)లో వచ్చిన జనరేటివ్(Generative) సిద్ధాంత లక్ష్యం వంటిది. ఒక వ్యవహర్త ప్రయోగించే వాక్యాలసంఖ్య పరిమితం (finite) అయినా, అతనికి అనంతమైన (infinite) వాక్యాలను ప్రయోగించగల దక్షత ఉంది. ఇది అతను నిర్మించుకున్న అమూర్త వ్యాకరణం ఇచ్చిన శక్తి. దీనికి భౌతికమైన అవధులు (మనిషి జీవితమే పరిమితం) ఉండటం వల్ల వ్యవహర్త ప్రయోగించే వాక్యాల సంఖ్య ఎప్పుడూ పరిమితమే. ఇటువంటి అనంత వాక్య ప్రయోగ దక్షత ఇచ్చిన అమూర్త వ్యాకరణానికి మూర్త రూపకల్పనే వ్యాకర్తల లక్ష్యం. ఇటువంటి దక్షతను ప్రతిభ అని వాక్య ప్రయోగాన్ని ప్రవృత్తి అని తెలుగులో వ్యవహరిస్తున్నాను (Competernce and perforenance). కేవలం ప్రయోగించిన వృత్తాలకు లక్షణం చెప్పటం కాకుండా భాషలో సాధ్యమయిన వృత్త సమస్తానికి ఆటోమేటిక్‌గా లక్షణ నిర్వచనం చేసే సిద్ధాంతంగా ఛందశ్శాస్త్రాన్ని ప్రాచీనులు పరిగణించారు గనుక వీరి సిద్ధాంతాన్ని కూడా జనరేటివ్ సిద్ధాంతంగానే గుర్తిస్తున్నాను

సాధ్యమయిన అన్ని క్రమాలను పద్యభేదాలుగా లెక్కగడితే గద్యానికి పద్యానికి భేదం ఎక్కడ ? ఏ వాక్యం తీసుకున్నా ఏదో ఒక అక్షర సంఖ్య ఉంటుంది. ఏదో ఒక అక్షర క్రమం ఉంటుంది. ఇటువంటివి నాలుగు కూరిస్తే భిన్న అక్షర క్రమాలుగల పాదాలతో విషమ వృత్తం అవుతుందిగదా? అటువంటప్పుడు ఏ వ్యాసాన్నయినా ఆ పద్ధతిలో పాద విభజన చేసి విషమ వృత్తాలుగ నిరూపించటానికి వీలు లేదా? ఇదీ సంపత్కుమారగారుదేశించిన ప్రశ్న. ఇంత జనరేటివ్ సిద్ధాంతాన్ని ఊహించిన ఛందశ్శాస్త్రకారులకు మాత్రం ఈ ప్రశ్న తట్టి ఉండదా? అందుకే వృత్త నిర్మాణ యంత్రంలో మిగతా భాగాలు, వాటిలో నియమాలు. అక్షర క్రమపు అరకు అపరిమితమైన, అవసరానికి మించిన ఉత్పాదకశక్తి (Strong Generative Capacity ) ఉంది. దాన్ని అట్లాగే వదిలేస్తే భాషంతా పద్యమే అయే అవకాశం ఉంది. ఈ అపరిమితోత్పాదకశక్తికి కొన్ని కళ్ళేలు తగిలించాలి. ఆ పనే మిగతా అరలు వివిధ నియమాల (Constraints) రూపంలో చేస్తై. ఈనియమాలను **Well formedness conditions** అనొచ్చు. ఉత్పత్తి అయిన పాదంలో నిర్దిష్ట స్థానంలో విరామం ఉండాలని, పాదాంతంలో విరామం ఉండాలని సంస్కృతంలో చెప్పిన నియమాలు ఇటువంటివి. నిర్దిష్ట స్థానంలో యతి మైత్రి ఉండాలనేది తెలుగువాళ్ళు తయారుచేసిన కళ్ళెం. ఈ విరామంగాని, యతి

మైత్రిగాని ఐచ్ఛికం అని వాదించవచ్చు. విరామం తప్పనిసరి అని సంస్కృతంలో కొందరైనా భావించారు (చూ. సంపత్కుమార 1962). యతిమైత్రి ఐచ్ఛికంగా తెలుగులో ప్రాచీను లెవరూ భావించలేదు. ఐచ్ఛికమని భావించినవారిలో అక్కిరాజు ఉమాకాంతం గారు ముఖ్యులు. అయితే యతి మైత్రి స్థానంలో విరామం ఉండాలని ఆయన మతం.

ఏకాక్షర, ద్వ్యక్షర వృత్తాలుగా వాక్యాలను విభజించవచ్చు. కాని, ఒక వ్యాసాన్నంతటినీ అట్లా విభజించటం సాధ్యంకాదు. పాదాంత విరామం చివరికంటా సరిపడదు: కేవలం ఒక అక్షరంతో గాని, రెండక్షరాలతోగాని అంతమయ్యే మాటలు ఎన్ని ఉంటై? పైగా రెండక్షరాలనగానే తెలుగులో ప్రాస మైత్రి అనేది ఒకటి అడ్డుకుంటుంది. పది అక్షరాల లోపునే పాద పరిమితి పాటిస్తూ విషమ వృత్తాలు సృష్టించవచ్చు. కాని పాదాంత విరామంగాని, ప్రాస మైత్రిగాని దెబ్బతినకుండా ఒక వ్యాసాన్ని వృత్తంగా నిరూపించటం సాధ్యమవుతుందనుకోను. ఇక్కడ గుర్తించాల్సిన విషయ మొకటుంది. ఈ వృత్త నిర్మాణ యంత్రంలో కొత్త నియమాలు పెట్టుకోటానికి వీలుంది. అట్లాంటి వీలుండటంవల్లనే తెలుగువాళ్ళు యతిమైత్రి, ప్రాస మైత్రి అనేవి కొత్తగా చేర్చుకో గలిగారు, ఇట్లాంటి నియమాలకు వీలున్నంతవరకు వ్యాసాన్ని వృత్తాలుగా నిరూపించే అవకాశమే లేదు. **Well formedness Conditions** ఉండటంవల్ల ప్రాచీన ఛందశ్శాస్త్ర గద్య పద్య విభాగం సరిగ్గానే చెయ్యగలుగుతున్నది. సంపత్కుమారగారి వచన పద్య లక్షణాలకు సిద్ధాంతబలం లేదు. గద్య పద్యాలను వేరుచేసే శక్తిలేదు. అర్థంమీదగాని, భావంమీదగాని ఆధారపడి పద్యరూపాన్ని నిర్వచించే ఏ లక్షణానికైనా ఈ శక్తి ఉండదు.

అయితే వ్యాసానికీ వచన పద్యానికీ అచ్చులోనేనా భేదం? 'అంతే' అని సంపత్కుమార సంతోషంతో అంటారనుకోను. కాని వారి భావగణ పద్ధతిని అంగీకరిస్తే ఇంకో మార్గంలేదు. వాక్య నిర్మాణంలో భేదం కనిపిస్తుంది. వ్యాకరణ సహాయంతో ఈ భేదాన్ని నిరూపించటం సాధ్యం కావచ్చు. అప్పుడైనా వచన పద్యాన్ని ఛందో విభాగంగా నిరూపించటం సాధ్యంకాదు. మామూలు వచనానికి, ఛందో నియమంలేని కవిత్వపు వచనానికి వాక్య నిర్మాణంలో ఎట్లాంటి భేదం ఉందో తెలుసుకోవచ్చు. సాధారణ వ్యవహారాతిరిక్త భాషా ప్రయోగం సాహిత్యానికి కనీసం ఒక లక్షణం. ఛందస్సుల్లో ఈ అసాధారణత్వం అక్షరాల కూర్పువల్ల సాధించబడింది, అంటే ఇక్కడ అక్షరాల పరిమాణానికి, నిర్ణీతమైన వాటి ఏర్పాటుకు ప్రాధాన్యం ఉంటుంది. ఈ అసాధారణ్యం ధ్వని సంబంధమైంది. వచనపద్యంలో దీనిమీద దృష్టి ఉండదు. ఆసాధారణత్వం ఇంకో మార్గంలో సాధించబడాలి. అది వాక్యనిర్మాణంద్వారా సాధ్యపడుతుంది. ఈ అసాధారణత్వాన్ని గుర్తించటానికి వ్యాకరణం —ముఖ్యంగా వాక్య నిర్మాణ విభాగం— సాయపడుతుంది. (ఈ పేరాలో వాడిన 'అసాధారణత్వం' అనే మాటను పరిభాషగా గ్రహించాలి). ఈ మార్గంలో వచన పద్యాన్ని పరిశీలిస్తే కొన్ని కొత్త విషయాలు బయటికి రావచ్చు. భావగణ పద్ధతివల్ల వచన పద్యాన్ని గురించి మనం గ్రహించగలిగింది ఏమీలేదు.

శ్రీ సంపత్కుమార "తేషాంబుక్, యత్రార్థవశేన పాద వ్యవస్థా" అనే జైమినీయ మీమాంసా న్యాయ సూత్రాన్ని ఒకటి ప్రమాణంగా పట్టుకొచ్చారు. అది వచన పద్య పాద విభజనలో ఎట్లా ఉపకరిస్తుందో నాకు బోధపడటం లేదు. ఎందుకంటే బుక్కులు వచన పద్యాలు కావుగదా. బండి నాగరాజాగారు (1973) అడిగినట్లు పఠనంలోనా? లేఖనంలోనా? బుక్కుల్లో పాద విభజన పఠనానికి; వచన పద్యంలో పాద విభజన అసలు ప్రయోజనమేమిటో నాకు తెలీదు గాని అచ్చులో మాత్రమే దానికి ప్రాధాన్యం కనిపిస్తున్నది. పైగా బుక్కులు అక్షరచ్ఛందస్సులు. (గాయత్రీ,అనుష్టుప్ మొ.) వాటిలో అక్షర సంఖ్య నిర్దిష్టం. నిర్దిష్టమైన అక్షర సంఖ్య ఉన్నా ఇతర నియమాలు లేనప్పుడు పాద విభజన గ్రహించటం కష్టం అవుతుంది. అటువంటప్పుడు పాదాంతంలో విరామం ఉంటే పాదవిభజన గ్రహించటం తేలికవుతుంది. అట్లా విరామం ప్రకృతి ప్రత్యయాల మధ్య గాని, పద మధ్యంలో గాని సాధ్యం గాదు. అందువల్ల అర్థ భంగం కాని విధంగా పాద విరామం ఉండాలి. "యత్రార్థ వశేన పాద వ్యవస్థా" అనే దానికి ఎక్కడ పడితే అక్కడ అర్థాన్ని బట్టి పాద విభజన చెయ్యవచ్చునని అర్థం ఉందనుకోను. అట్లా అయితే బుక్కుల్ని వచన పద్యాలుగా ఎందుకు భావించగూడదు? అక్షరసంఖ్యా నిబద్ధమైన పద్య పాదాల్లో పాద విభజన అర్థభంగం కలిగించని విధంగా ఉండాలని పై సూత్రానికి తాత్పర్యంగా గ్రహిస్తున్నాను. వచన పద్యాలకూ బుక్కులకు ఏట్లా సంబంధం లేదో, వాటిని గురించి చేసిన ప్రతిపాదనలకూ అంతే సంబంధం లేదు. అదీ గాక హేతుబద్ధతే ప్రమాణం కన్నా ఎక్కువ విలువైనదిగా గ్రహిస్తాను.

ఒక్కోచోట మే మిద్దరం ఒకర్నొకరు అర్థం చేసుకోలేక

పోతున్నాం. మా వేవ్ లెంగ్త్స్ (Wave lengths) ఎక్కడో భేదిస్తున్నై. బహుశా కొన్ని మాటల్ని మేమిద్దరమూ ఒకే అర్థంలో వాడటం లేదేమో? హేతుబద్ధంగా విషయాన్ని పరిశీలించటానికి ఇద్దరమూ ప్రయత్నిస్తున్నా అంగీకారానికి రాలేకపోతున్నాం. [రావాలని నియమం ఏమీ లేదు] బహుశా నేననుకునే హేతుబద్ధత ఆయననుకునే హేతుబద్ధత ఒకటి కాదేమో.

పూర్వ వ్యాసాల్లో కొన్నిటిని చాలా సంక్షిప్తంగా చెప్పటంవల్ల అవి అపార్థాలకు తావిచ్చినై. ఉదాహరణకు "పూర్వపరవ్యంజనంతో సంబంధం లేకుండా దీర్ఘాచ్చు గాని, పరవ్యంజనంతో మూతబడ్డ హ్రస్వాచ్చు గాని గురువు అవుతుంది" అన్నాను. దీర్ఘాచ్చు ఎప్పుడైనా గురువే అవుతుందని, హ్రస్వాచ్చు పరవ్యంజనంలో మూతబడ్డప్పుడు మాత్రమే గురువు అవుతుందని నా ఉద్దేశం. పై స్థూలీకరణ అక్షరాలు (Syllables) ఆధారంగా చేసుకొని చెప్పింది. అయితే నేను కొన్నిటిని వదిలేశాననుకొని శ్రీ సంపత్కుమార వాటిని పూరించారు. అందులో తప్పులేదు గాని; ఆ పూరణకు అవసరం లేదు. అదే సందర్భంలో గురు లఘు నిర్ణయంలో హేతుబద్ధత లేదన్నారు శ్రీ సంపత్కుమార. అట్లా విందుకనుకుంటున్నారో నా కర్థం కావటంలేదు. నేననుకుంటున్న హేతుబద్ధతను కొంచెం సూచిస్తాను.

అచ్చుల్లో హ్రస్వదీర్ఘ భేదాలున్నై. ఒక్కోసారి ఉచ్చారణలో మనం హ్రస్వాచ్చులనుకుంటున్నవి, దీర్ఘాచ్చులనుకుంటున్న వాటికన్నా దీర్ఘంగా వినిపించవచ్చు. దీర్ఘాచ్చులనుకుంటున్న వాటిల్లో కూడా తరతమ భేదాలుండవచ్చు. అందువల్ల వీటి మీద ఆధారపడ్డ గురు లఘు నిర్ణయంలో వ్యత్యయం రాదా అనే ప్రశ్న రావటం సహజం. హ్రస్వ దీర్ఘ స్వర భేదం భాషలో సైకలాజికల్ రియాలిటీ [psychological reality] మీద ఆధారపడి ఉంది. ఇది ఫిజికల్ రియాలిటీ [physical reality]తో భేదించవచ్చు. ఈ విషయాన్ని ప్రపంచించటానికి వ్యాస విస్తరణ భీతి అడ్డు వస్తున్నది. అయినా ఒకటి, రెండు ఉదాహరణలిస్తాను.

తెలుగులో నాకు — చింత అనే మాటల్లో మొదటి మాటలో వదాది, వ్యంజనాన్ని, రెండోమాటలో సున్నాతో సూచించిన వ్యంజనాన్ని ఒకటిగానే గుర్తిస్తున్నాం. [స్పర్శం ముందు అనునాసిక వ్యంజనాన్ని సున్నతో సూచించటానికి కారణం [predictability] వీటిమధ్య భౌతికమైన ఉచ్చారణభేదం ఉంది.. మొదటిది దంతమూలీయం, రెండోది దంత్యం. అయినా రెండుచోట్లా తవర్గానునాసికంగానే పరిగణిస్తున్నాం. అట్లాగే మనం స్పర్శాలుగా పరిగణిస్తున్న వర్ణాలు కొందరి ఉచ్చారణలో ఊష్మాలు కావచ్చు. ఉదా: ఫలితం' కఫం. మనం ఉభయోష్ఠ్యాలుగా పరిగణిస్తున్న వర్ణాలు కొందరి ఉచ్చారణలో దంతోష్ఠ్యాలుగా వినిపించవచ్చు. ఉదాహరణకు ప, బ, మ లు రెండు పెదాలూ మూయటానికి ఇబ్బంది ఉన్న వ్యవహర్తల ఉచ్చారణలో దంతోష్ఠ్యాలుగా వినిపించవచ్చు. ఈ వ్యవహర్తల తెలుగు భాషకు చేసే వర్ణ నిర్ణయంలో ఈ భౌతికమైన భేదాలు అడ్డు రావు. సైకలాజికల్గా న వర్ణం దంత్యమే, ప వర్గ స్పర్శమే, ప, బ, మ లు ఉభయోష్ఠ్యాలే. ఇక్కడ లోపానికి ప్రసక్తి లేదు. ఇది హేతుబద్ధమైన నిర్ణయమే. అటాగే గురు లఘు నిర్ణయం కూడా. గురు లఘు భేదం భాషలో అక్షరాల [Syllables] పరిమాణానికి సంబంధించింది. భాషకు సంబంధించిన నిర్ణయాలు చేసేటప్పుడు సైకలాజికల్ రియాలిటీనే పరిగణించాలి. గురు లఘు నిర్ణయంలో ప్రాచీనుల్లో మత భేదాలున్నంతమాత్రాన వాటిని వ్యవస్థా రాహిత్యానికి సూచకాలుగా గ్రహించగూడదు.

నేను ప్రత్యేకంగా ప్రస్తావించని విషయాలను నేను అంగీకరించినట్టుగా భావిస్తున్నారు సంపత్కుమార. కొన్ని అంశాలను ప్రస్తావించకపోవటానికి ఎన్నో కారణాలుండవచ్చు. కొన్ని అంశాలు వాదించదగినవిగా నాకు తోచకపోవచ్చు. కొన్ని విషయాలు అతి స్పష్టంగా ఉన్నప్పుడు వాటిమీద చర్చోపచర్చలను పెంచటవల్ల ప్రయోజనం ఏమిటి ? "అయితే, నేను విభజించిన రీతిని గూర్చి రామారావుగారు ఏమీ అనలేదు కాబట్టి నా విభజన సరిగానే ఉందనుకోవాలి" అని రాశారు. వచన పద్యంలో పాద విభజనకు నిర్దిష్ట సూత్రం ఏమీ లేదని వాదించే నేను, ఆయనగానీ మరొకరుగానీ చేసే పాద విభజనను ఎట్లా అంగీకరిస్తాను? అసలు అంగీకరించటం, నిరాకరించటం అనే సమస్య కూడా రాదు. 'ఆర్బిట్రరీ' Arbitraryగా జేసే విభజన, తప్పూకాదు, ఒప్పూకాదు.

పద్యవిభజనలోఉన్న వైవిధ్యాన్ని గురించి చెపుతూ (Metrical convergence) ను గురించి ప్రస్తావించాను. శ్రీ సంపత్కుమార దాన్ని నే నుద్దేశించిన అర్థంలో గ్రహించలేదు పద్య విభజనలో భిన్నత్వం (predict) చెయ్యదగింది అవునా కాదా అనే దృష్టిలో

నేను పరిశీలించాను. ఈ విషయం స్పష్టంగా తెలియజెయ్యటంకోసం వ్యాకరణ భిన్నత్వం ఒకే వాక్యానికి రెండర్థాలను ఎట్లా కలిగిస్తుందో పరిశీలిస్తాను.

1. ఇంటో బియ్యం లేవని మా ఆవిడ రొాళ్ళెలు చేసింది. ఈ వాక్యానికి రెండర్థాలున్నై. ఆ అర్థాలు కింది వాక్యాల్లో వ్యక్తమవుతున్నై.

2. "ఇంట్లో బియ్యంలేవు" అని [నాతోఅని] మా ఆవిడ రొాళ్ళెలు చేసింది [అనుకరణార్థం]

3. ఇంట్లో బియ్యం లేవు కాబట్టి మా ఆవిడ రొాళ్ళెలు చేసింది. [హేత్వర్థం]

ఈ రకమైన భిన్నార్థకత వ్యాకరణం predict చేస్తుంది. మొదటి అర్థం అని అనుధాతువునుంచి ఏర్పడ్డ క్త్వార్థక రూపంగా అన్వయించటం వల్ల వచ్చింది. [అనుకరణలో వచ్చే అని వెనువెంటనే వచ్చే అనుధాతు నిష్పన్న రూపాల ముందు వికల్పంగా లోపిస్తుంది.] రెండో అర్థం అని అనిష్పన్నమైన అవయవి సూచకంగా గ్రహించటం వల్ల వచ్చింది. అనుధాతువు నుంచి నిష్పన్నమైన క్త్వార్థక క్రియ, అవయవి సూచకమైన (Construction marker) అని ఒకే రూపంతో ఉండటంవల్ల ఈ అర్థభేదం వచ్చింది. నిర్దిష్టమైన వ్యాకరణ సూత్రాలమీద వాక్య నిర్మాణం ఆధారపడి ఉండటం వల్ల ఈ భిన్నార్థకతను చెయ్యగలిగాం. కాని ఈ కింది వాక్యాన్ని పరిశీలించండి.

4. సీత అలంకరించుకొని మా ఇంటికి వచ్చింది.

ఇక్కడ సీత పాశ్చాత్య పద్ధతిలో అలంకరించుకొన్నదా? ప్రాచ్య పద్ధతిలో అలంకరించుకున్నదా? ఉత్తరాది పద్ధతిలో ముడి వేసుకున్నదా? దక్షిణాది పద్ధతిలో పూలజడ వేసుకున్నదా? అనే విషయం వ్యాకరణం చెప్పలేదు. వీటిల్లో ఏ అర్థమైనా రైటు కావచ్చు. లేక ఇంకేదైనా కావచ్చు. సీత అనే అమ్మాయిని చూస్తే తప్ప ఏ విషయమూ చెప్పలేము. ఇది వ్యాకరణం చెయ్యలేనిపని. ఇది వాక్య నిర్మాణ సూత్రాలమీద ఆధారపడి వచ్చిన అస్పష్టతకాదు. అందువల్ల ఇక్కడ (systematic convergence) లేదు. ఈ పద్ధతిలో శ్రీ సంపత్కుమార ఉదాహరించిన "మధుర మధురమైన మామిడిపండ్లను" పరిశీలించాను. ఇవి సీసభాగమా, ఆటవెలది భాగమా అనేది మనం (predict) చెయ్యొచ్చు. అంటే రెండిట్లో ఏదో ఒకటిగా మాత్రమే విభజించటానికి వీలున్నదని చెప్పవచ్చు. వచన పద్యపాద విభజనలో భిన్నత్వం అట్లాంటిదికాదు. దీనికి నిర్దిష్టసూత్రాలులేవు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే "మధుర మధురమైన మామిడిపండ్లను" విభజించటానికున్న భిన్నపద్ధతులను మనం ముందుగా చెప్పవచ్చు. ఛందశ్శాస్త్రం అందుకు సాయపడుతుంది. పాదవిభజన లేకుండా రాసిన వచన పద్యాన్ని ఒకరికి పాదవిభజన చెయ్యమని ఇస్తే అతను ఏ యే పద్ధతుల్లో చెయ్యడానికి వీలుందో predict చెయ్యగలమా? అతను విభజన చేసిన తరువాత నువ్వు ఇట్లా ఎందుకు చేశావంటే కారణం చెప్పగలడా? అందుకే శ్రీ సంపత్కుమార అచ్చులోకాని, రాతలో కాని పాదవిభజనను సూచించాలనటం. అంటే అట్లా predict చెయ్యటానికి వీలులేదని వారంగీకరించినట్టే. వచన పద్యంలో కూడా అట్లా predict చెయ్యటానికి వీలుందని అయితే ఆ విభజించేవాడు ఈ predict చేసే వాడూ భావగణాలను తెలుసుకొని ఉండాలని వాదిస్తే శ్రీ సంపత్కుమార వాదానికీ బలంవచ్చేది. ఆ భావగణాలను గుర్తుపట్టటం ఎట్లా అనేది వేరేప్రశ్న. శ్రీ సంపత్కుమార దాన్ని గురించి ఎట్లాగూ వేరే ఆలోచించాలి. నే నుద్దేశించినదాన్ని శ్రీ సంపత్కుమార గ్రహించలేదు. అందుకే "ఇక్కడ వేరువేరుగా విభజించేందుకు గల అవకాశం ప్రధానంగాని రెండు విధాలుగానా? మూడువిధాలుగానా అన్నది ప్రధానంకాదు" అని రాశారు. ఎన్నివిధాలుగా అన్నదికూడా ఇక్కడ ప్రధానమే. predict చెయ్యటమంటే అదే. systematic convergence ఉన్నప్పుడు ఎన్ని విధాలుగా విభజించటానికి వీలుందో predict చెయ్యొచ్చు. మధుర మధురమైన మామిడిపండ్లను (జాతుల్లో) రెండు విధాలుగా మాత్రమే విభజించటానికి వీలుంది. వచన పద్యానికి system లేదు గనక అట్లాంటి prediction సాధ్యంకాదు. ఒకవేళ predict చేస్తే వ్యాకరణాంశాలనుబటి predict చెయ్యవచ్చు. అప్పుడది ఛందస్సుకు సంబంధించిన prediction కాకుండా పోతుంది.

ఇక భావగణాల దగ్గరికొస్తే, వాటిని వివరించానంటున్నారు సంపత్కుమార. ఆ వివరణ చాలదంటున్నాను. 'అనల తోరణం' అనే కూర్పులో ఇది భావగణం, ఇది భావాంశం అని చూపించిన మాట నిజమే. ఎందువల్ల ఇది భావగణం, ఎందువల్ల ఇది భావాంశం

అనే ప్రశ్నలు వారు వేసుకోలేదు. నేను వేసిన వాటికి సమాధానా లియ్యలేదు "ఇక్కడ భావం పూర్తి అవుతున్నది. ఇక్కడ భావం స్ఫురిస్తున్నది" అనే వాటిని సంతృప్తికరమైన సమాధానాలుగా నేను గ్రహించలేను. ఇది ఇంతే నంటే నేను చెయ్యగలిగింది లేదు. ఇక వాదాలు అంతటితో ఆగిపోవటం తప్ప మార్గాంతరం లేదు. ఇంతకు పూర్వం లక్షణాలు చెప్పినా వాళ్ళు ఇట్లాంటి ప్రశ్నలు వేసుకున్నారు. ఆదృష్టి తో లక్షణాలు చెప్పారు. వాటిని మనం అన్వయించుకొని చూడవచ్చు. అందువల్ల అవి శాస్త్ర ప్రతిపాదనలుగా నిలబడగలిగినై - అవి సమగ్రమా ? అసమగ్రమా ? అనేది వేరేప్రశ్న.

పద్యానికి పాద బద్ధత అనేది ప్రధానాంశం అని మేమిద్దరమూ అంగీకరిస్తున్నాం. ఆ పాద బద్ధత ఎట్లాంటిది అనే అంశం మీదనే భేదిస్తున్నాం. పాదవ్యవస్థను అర్థంచేసుకోటానికి అంతర్నిర్మాణమూ బాహ్య పరిమితి అనే అంశాలను ప్రతిపాదించాను. నిజానికీ మాటలు మాత్రమే నేను కొత్తగా ప్రతిపాదించింది. ఈ భావనలు పూర్వం నుంచీ ఉన్నవే. లేకపోతే ఒక పాదంలో అక్షరాల క్రమాన్ని గురించి గాని, గణ క్రమాన్ని గురించిగాని, ఫలాని అక్షరం ఫలానిదై ఉండాలనిగాని, ఫలానిది కాగూడదనిగాని చెప్పటానికి కారణం కనిపించదు. పాదవ్యవస్థకు అడ్డు వచ్చేది దండకం ఒకటుంది. ఒక్కోగణాన్ని పాదంగా పరిగణిస్తే పాదవ్యవస్థను దానికికూడా అన్వయించవచ్చు. మాలికా వృత్తాలకు దండకానికి భేదం (తెలుగులో) ఒకటే కనిపిస్తున్నది. దండకానికి ప్రాసనియమంలేదు. ప్రాసనియమంలేని మాలికా వృత్తంగా దండకాన్ని పరిగణించవచ్చు. అంతర్నిర్మాణ విషయంలో ఏకాక్షరవృత్తం లొంగదు. ఒక set తనలో తాను అంతర్భాగం కూడా అవుతుందన్న గణిత శాస్త్ర ప్రతిపాదనను దీని కన్వయించవచ్చు గాని దానివల్ల సాధించగలిగిన ప్రయోజనం విషయంలో నాకు స్పష్టమైన అభిప్రాయం లేదు. అందువల్ల పై రెండు ఛందోభేదాలను **maginal cases**, గానూ, వాటినిగురించి నేను చేసిన సూచనలు **adhoc solutions** గానూ గ్రహించాలి.

నేను ప్రతిపాదించిన బాహ్యపరిమితి విషయంలో శ్రీ సంపత్కుమారకు పేచీ లేదు. అంతర్నిర్మాణం విషయంలోనే అభ్యంతరం చెప్తున్నారు. నిజానికి అభ్యంతరం చెప్పాల్సిన అవసరంలేదు అంతర్నిర్మాణం ఉంటుందని ఒప్పుకోటమూ, అది ఫలాని విధంగా ఉంటుందని ఒప్పుకోటమూ ఒకటికావు. ఈరెండిటినీ సంపత్కుమార కలిపేస్తున్నారు. "ఏ విధమైన పద్యపాదానికిగూడా అంతర్నిర్మాణమంటూ ఏదీ ఉండదు" అనే వాక్యం వారి అసలు ఉద్దేశాన్ని వెల్లడించటంలేదు. అంతర్నిర్మాణం చెప్పటానికి గణపద్ధతి ఒకటే ఉందని నేననుకుంటున్నట్టు సంపత్కుమార అనుకుంటున్నట్టున్నారు. ఈ విషయంలో నా అభిప్రాయాన్ని బండి నాగరాజుగారు (1973) విస్తరించారు గనుక దాన్ని గురించి ఇక్కడ ఎక్కువగా ప్రస్తావించను. "పాదం అక్షర సముదాయంకాదు, గణసముదాయం" అని నేను మొదటి వ్యాసంలో (రామారావు 1972) అన్నమాట స్థూల దృష్టి తో చెప్పింది. రెండో వ్యాసంలో (రామారావు 1972) దాన్ని గురించి విపులంగా చర్చించి అంతర్నిర్మాణానికి గణసహాయం అవసరం లేదన్న సంపత్కుమార సూచనను వృత్తాల విషయంలో గ్రహించాను. మాత్రాపద్యాల విషయంలోనూ. జాతుల విషయంలోనూ గణ సహాయం అవసరం అన్నాను. అంటే గణాల్లేకుండా లక్షణం చెప్పటం అసలు కుదరదనికాదు.

అట్లా చెప్పటంలో సంక్షిప్తత లేదని నా ఉద్దేశం. దాన్నే ఏకైక పద్ధతి అన్నాను. గణాల పద్ధతిలో చెప్పటంలో సంక్షిప్తత ఉంది, సౌలభ్యంఉంది. ఈ మాటల్ని మామూలు అర్థాలో కాక టెక్నికల్‌గా వాడుతున్నాను. కాయితంమీద తక్కువచోటుపడుతుంది కాబట్టి సంక్షిప్తత, సూత్రం (లక్షణం, నియమం) తేలిగా చదవచ్చు గాబట్టి సౌలభ్యం అవసరమని నా ఉద్దేశం కాదు. పట్టే చోటుతోగాని, చదివే సౌకర్యంతోగాని శాస్త్రానికి సంబంధంలేదు. ఇంతకన్నా ఎక్కువ ప్రయోజనం ఉంటేనే సంక్షిప్తతకూ, సౌలభ్యానికీ శాస్త్రంలో ప్రవేశం ఉంటుంది. స్పష్టతకోసం వ్యాకరణంనుంచి ఒక ఉదాహరణ చూపిస్తాను. సంకేతాలద్వారా ఈ సంక్షిప్తత సాధించబడింది. బాలవ్యాకరణంలో ఈ దిగువ సూత్రం ఉంది.

"అగు, వచ్చు, చొచ్చు, చూచులకు ముత్తు పరంబగునపుడు కా, రా, చొరు, చూడులగు" (క్రియ–91)

తెలుగు క్రియలో కొన్నిటికి భిన్నపరిసరాలో వచ్చే రూపభేదాలను వాటి వర్ణ సంయోజనాన్నిబట్టి నిర్ణయించలేం. అట్లాంటివి పై సూత్రంలో చెప్పిన క్రియలు ఈ రూపభేదాన్ని కలిగించే పరిసరాలు 'ముత్తు' అనే సంకేతంతో సూచించబడ్డాయ్. ఈ 'ముత్తు' వేటికి సంకేతమో వ్యాకరణంలో ఇంకో చోట చెప్పబడింది. ఈ ముత్తు అనే సంకేతం లేకుండా చెప్పకూడదా అంటే తప్పకుండా చెప్పవచ్చు. అయినా వ్యాకర్త సంక్షిప్తతనే

వరించి 'ముత్తు' అనే సంజ్ఞను వాడాడు. నిజానికి ఈ 'ముత్తు' ఏమిటో తెలుసుకోవాలంటే వేరే సూత్రాలు వెతుక్కోవాలి. ఆ రకంగా చదవటంలో క్లిష్టతకూడా ఉంది. అయినా ఈ సంకేతాన్ని వాడటంవల్ల వ్యాకర్త సాధించిందేమిటంటే శాస్త్ర సంక్షిప్తత. అదే ఏకైక పద్ధతిలో చెప్పటం. భిన్న పరిసరాల్లో జరిగే మార్పుల్లో ఉన్న 'ఏకత' ను ఈ సూత్రం ద్వారా వ్యక్తపరిచాడు. ఈ పరిసరాలన్నీ కలిపి కలిగించే మార్పు ఒకటేనన్న విషయం తెలియపర్చటానికే ఈ సూత్రం ఇట్లా రాయబడ్డది. 'ముత్తు' అవసరంలేదని ఎవరైనా వాదించవచ్చు. సాధారణీకరణ (generality) ని సాధించదల్చుకున్న వ్యాకర్తకిది అవసరమే.

ఈ దృష్టితోనే నేను గణాల అవసరాన్ని పరిశీలించాను. వృత్తాల లక్షణాన్ని గణాలతోనూ చెప్పవచ్చు. అక్షరక్రమంతోనూ చెప్పవచ్చు. గణాలతో చెప్పటంలో సంక్షిప్తత లేదా అంటే మామూలు దృష్టిలో ఉందిగాని శాస్త్ర దృష్టిలో లేదు. అక్షరక్రమంలో చెప్పిన దానికన్నా గణక్రమంలో చెప్పటంవల్ల వృత్తాల్లో సాధించే 'జనరాలిటీ' లేదు. అంటే అక్కడి సంక్షిప్తత శాస్త్ర సంక్షిప్తతకాదు. అందువల్ల వృత్తాల అంతర్నిర్మాణాన్ని చెప్పటానికి గణాల అవసరం లేదంటే గణాలసాయంలో చెప్పలేమనికాదు. అట్లా చెప్పటంవల్ల సాధించే శాస్త్రసంక్షిప్తతలేదని, కాని జాతుల విషయంలో అట్లాంటిది ఉంది. భిన్నాక్షరక్రమాలు ఇక అంతస్సూత్రంమీద ఆధారపడి ఉన్నయ్యన్న విషయాన్ని జాతుల్లో గణసహాయంద్వారా చెప్పవచ్చు. అక్షరక్రమంలో చెప్తే ఈ అంతస్సూత్రాన్ని (underlying princeple) చెప్పలేం. అట్లాగే మాత్రా ఛందస్సుల విషయం. అందుకే నా నవంబరు వ్యాసంలో (రామారావు 1972) 'ఏకైక పద్ధతి' అని వాడింది. దాన్నే బొమ్మలసాయంతో వివరించాను.

జాతులకు నిర్దేశించిన గణాలు సమమాత్రకాలుకావు. అంతే కాక ఆ గణాలు ఏకైక అక్షరక్రమాన్ని ఇయ్యలేవు. సమమాత్రకాలు అయితే మాత్రాగణాల్లో చెప్పవచ్చు. ఒకే అక్షరక్రమాన్ని ఇస్తే వృత్తాలకులాగే ఇక్కడ కూడా సాధించే శాస్త్ర సంక్షిప్తతలేదు. జాతుల గణాల్లోని ఈ వ్యత్యాసాన్ని గురించి చెప్తూ శ్రీ సంపత్కుమార "ఆ గణాల పరిస్థితి అట్లా ఉన్నది" అని అన్నారు. పరిస్థితి అట్లా ఉన్నది కాబట్టే ఆ గణాలు అక్కడ అవసరమయినై. "ఆలోచిస్తే, లక్షణ కథనంలోని సౌలభ్యంకోసమే ఈ గణపద్ధతి అని స్పష్టం', అని రాసిన దానితోకూడా నాకు పేచీలేదు. అయితే ఆ సౌలభ్యం నేను పైన సూచించిన శాస్త్ర సంక్షిప్తతను సాధించద కావాల. శాస్త్ర సంక్షిప్తత అవసరమా కాదా అంటే అవసరమని నా అభిప్రాయం. నా అభిప్రాయంతో శ్రీ సంపత్కుమార ఒప్పుకోకపోవచ్చు. భారతీయ శాస్త్రకారులీ సంక్షిప్తతను సాధించటానికి ప్రయత్నించారని తెలిసిన వాళ్ళంటారు. ఆధునిక భాషాశాస్త్రంలో ఇది అతి ముఖ్యమైన లక్షణం. ఒక భాషకు సాధ్యమయిన భిన్నవ్యాకరణాల్లో ఉత్తమమైనది ఎంచుకోటానికి ఉపయోగించే లక్షణం (principle) ఇది. (చూ. రామారావు 1971)

మాత్రా పద్యాలకు మాత్రాగణాల్లో కాకుండా వేరే పద్ధతిలో లక్షణం చెప్పవచ్చుగాని శాస్త్ర సంక్షిప్తతను సాధిస్తూ లయను సూచిస్తూ చెప్పాలంటే మాత్రాగణాల సాయంతో చెప్పాలి, పాదాల్లో మాత్రల కలయికను గురించి చెప్పకుండా, పాదంలో మాత్రాసంఖ్యను మాత్రమే చెప్తే పాదాలు అంతర్నిర్మాణాన్ని గురించి చెప్పనట్టే ఇక వాటి అంతర్నిర్మాణాన్ని లయననుసరించి చెప్పాలంటే మాత్రాగణాల పద్ధతితోనే చెప్పాలని నా వాదం. అట్లా చెప్పకపోతే లయననుసరించి చెప్పినట్టుకాదు. అంటే ఆ పద్యానికి లయనిర్దేశం చెయ్యలేదన్న మాట. లయ నిర్దేశం చెయ్యకపోతే భిన్నలయలు వాడుకోటానికి వీలుంటుంది. మాత్రాగణాల్లో చెప్తేమాత్రం లయసాధ్యమవుతుందా అంటే మాత్రాగణాల్ని భాషలో ఉనిక ప్రవర్తన ననుసరించి వాడితే లయసాధ్యమవుతుంది. ఈ ఉనిక ప్రవర్తన పదపదాంశ విరామం మీదా, పదంలో గురులఘుక్రమంమీద ఆధారపడి ఉంటుంది. ఈ ఉనిక ప్రవర్తన ననుసరించే అనులోమ విలోమగతుల భేదంవస్తుంది. లయస్ఫురణలో పదపదాంశ, విరామాలూ, ఉనిక ప్రవర్తన చాలా ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తయ్యని పూర్వం [రామారావు 1972] సూచించాను.

ఇంతకీ జాతుల్నిగాని, మాత్రా ఛందస్సుల్లోగాని అంతర్నిర్మాణం గణాల్లో చెప్పాలా అక్కర్లేదా అనేది నా వాదానికి ప్రధానం కాదు. అట్లా చెప్పటంలోఉన్న సౌలభ్యాన్ని పైన చర్చించాను. రేపటి పరిశోధకులు గణపద్ధతికన్నా పటిష్ఠమైన ఇంకో పద్ధతిని సూచించవచ్చు. కాని అంతర్నిర్మాణం లేకుండా పద్యంఉండదు. ఫలాని అక్షరాలు ఫలాని క్రమంలో ఉంటయ్యనిగాని, ఫలాని అక్షరం గురువులో లఘువులో కావాలనిగాని, కాగూడదనిగాని చెప్పటం పాదంలో అంతర్నిర్మాణాన్ని గురించి చెప్పటమే అవుతుంది. ఈ విషయాన్ని నాగరాజుగారు (1973) గుర్తించారు.

ఇక భావ గణాల విషయం. భావగణ విభజనలో వ్యాకరణాంశాల పాత్రను శ్రీ సంపత్కుమార పూర్తిగా నిరాకరించలేదని గుర్తించాను. ఆ పాత్ర ఎంతవరకు అన్నదాంట్లోనే మా ఇద్దరికీ అభిప్రాయభేదం. వ్యాకరణ సంబంధాలకి, భావాంశాలకీ ఏకైక సంబంధం (one to one correspondence) ఉందని నా వాదం సంబంధాన్ని పూర్తిగా నిరాకరిస్తే అర్థబోధలో వ్యాకరణాంశాలకు పాత్రలేదనాల్సి వస్తుంది. అందువల్ల శ్రీ సంపత్కుమార మధ్యేమార్గాన్ని ఎన్నుకొని కొంతవరకు మాత్రం ఉంటుందంటున్నారు కాదు పూర్తిగా ఉంటుందని నా వాదం. దీనికి ఉపపత్తిగా వారు భావ గణాలంటున్న వాటిని నేను వ్యాకరణ గణాలుగా నిరూపించాను. సంపత్కుమార తన వాదాన్ని నిలబెట్టుకోవాలంటే వ్యాకరణ సంబంధాలు పాదవిభజనకు ఎక్కడవో నిరూపించాలి. కనీసం ఆ 'కొంత వరకు' అనేది ఎంతవరకో స్పష్టంగా చెప్పాలి. ఇది సాధ్యమనుకోను. భావగణాలని వారనుకుంటున్న వాటికి వ్యాకరణానికి అంత విడదియ్యరాని సంబంధంఉంది. అయితే భావస్ఫూర్తి ప్రధానంగాని, వ్యాకరణ సంబంధాలు ప్రధానం కాదంటారు శ్రీ సంపత్కుమార. ఈ సందర్భంలో అర్థాలంకారాల ప్రసక్తి తీసుకొచ్చారు. అర్థాలంకారాలను వ్యాకరణాలంకారాలు అని అనాల్సి ఉంటుందా ? అని అడుగుతున్నారు. అనక్కర్లేదు, అనగూడదు అని సమాధానం. ఒక అలంకారాన్ని ఒక కవి సంస్కృత శ్లోకంలో వాడినా, తెలుగు పద్యంలో వాడినా, పద్యంలో వాడినా, గద్యంలోవాడినా, పెద్దపద్యంలో వాడినా చిన్నపద్యంలో వాడినా, పెద్ద వాక్యంలోవాడినా చిన్నవాక్యంలో వాడినా, సంశ్లిష్ట వాక్యం (compound sentence) లా వాడినా, ఒక వాక్యంలో వాడినా, భిన్నవాక్యాలలో వాడినా ఒక అలంకారం అదే అలంకారం అవుతుంది. అలంకారాల్లో పాద విభజనలేదు. శబ్దరూపప్రాధాన్యం లేదన్న వాక్య వ్యవస్థనుబట్టి అలంకారం మారదు కాని వీరి భావగణాలు అట్లా మారకుండా ఉంటయ్యా? మారకుండా ఉండని పద్ధతిలో భావ గణాల్ని నిర్వచించారా ? ఎంతకీ "భావస్ఫూర్తినిబట్టి, భావాన్ని బట్టి అనేగాని అంతకన్నా స్పష్టమైన నిర్వచనం ఇవ్వటంలేదు. ఇప్పటి వ్యాసంలోనైనా (సంపత్కుమార 1973] వాక్యాలు చూడండి. "భావగణం ఏక పదంగా ఉంటుందా? బహుపదంగా ఉంటుందా ? అన్నప్పుడు అక్కడ ఉపయుక్తమైన పదాల స్థితి-అంటే ఏకపదం భావాంశ స్ఫోరకమైతే ఏక పదమే భావగణం. బహుపదాల సమష్టి భావాంశ స్ఫోరకమైతే ఆ సమష్టే భావగణం. భావాన్ని స్ఫురింపజేసే పదాలస్థితి అంటే ఇది దీన్నిబట్టి భావగణం ఏమిటో నా కర్థం కావటంలేదు. ఈ వాక్యాల్నుంచి భావగణస్వరూపాన్ని గ్రహించ లేని నా అశక్తతని మనస్ఫూర్తిగా ఒప్పుకుంటున్నాను. ఇంతకన్నా స్పష్టంగా భావగణ స్వరూపాన్ని వివరించటం కుదరదంటే చేసేదేమి లేదు.

పద్యపాదానికి అంతర్నిర్మాణ బాహ్యపరిమితులుంటయ్యనీ, వచన పద్యానికి అంతర్నిర్మాణం లేదని, బాహ్య పరిమితి అస్థిరం అని, భావగణాల స్వరూపం ఏమిటో స్పష్టంగా తెలియనందున భావగణాలు వచన పద్యాన్ని నిర్వచించలేవని, భావగణ విభజన ఏ పద్ధతిలో జరిగినా వచన పద్యాన్ని వచనం నుంచి భావగణాలు వేరుచెయ్యలేవనీ అందువల్ల వచన పద్యం ప ద్యం కా ద నీ ఇంకోసారి నిరూపించాను. అన్నింటా లైను కూర్చే పద్ధతిమీద ఆధారపడకుండా వచన పద్యాన్ని గద్యంనుంచి వేరుచేసే కొత్త లక్షణాన్ని శ్రీ సంపత్కుమారగాని, ఇంకొకరుగాని ప్రతిపాదించే వరకు ఈ విషయాన్ని గురించి చర్చించవలసిన అంశాలుకూడా లేవు.

శ్రీ సంపత్కుమార [1973] మార్చి భారతిలో ప్రస్తావించిన విషయాలన్నిటినీ ఈ వ్యాసంలో చర్చించలేదు. ఉదాహరణకు అప్పకవి ఛందోదోషాల్ని ప్రస్తావించాడా లేదా అనే ప్రశ్న ఉంది. అది చర్చించవలసిన విషయం కాదు. అప్పకవీయం తిరగేస్తే తెలిసే విషయం కొన్ని రకాల యతుల్ని, ప్రాసల్ని వాడగూడదని, అట్లా వాడిన కవులు 'ధూర్తులు' అనీ అన్నాడు అప్పకవి. కొన్ని ప్రయోగాలు కూడా ఇచ్చాడు. అవి ఒప్పులని అప్పకవి ఉద్దేశం కాదు. అయినా ఇవి అల్ప విషయాలు. ఇట్లాంటి కొన్ని విషయాలను ఈ వ్యాసంలో లెక్కలోకి తీసుకోలేదు.

రి ఫ రె న్సు లు


1. నాగరాజు, బండి (1973) "వచన పద్యం ఒక పరిశీలన", భారతి నవంబరు:
2. రామారావు, చేకూరి (1971) "భాషా శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం" ఎస్. సి. యస్. వేంకటాచార్యులు, అమరేశం రాజేశ్వర శర్మ (సం) "శారదా మంజీరము"లో సికింద్రాబాద్: గోలి ఈశ్వరయ్య.
3. ,, ,, (1972a) "వచన పద్యం : భావ లక్షణ నిరాకరణం ఆంధ్రపత్రిక. సంవత్సరాది సంచిక.
4. ,, ,, (1972b) "వచన పద్యం ఛందో విభాగం కాదు" భారతి, నవంబరు.
5. సంపత్కుమార, కోవెల (1962) 'తెలుగు ఛందో వికాసము' వరంగల్లు : కులపతి సమితి.
6. ,, ,, (1972) "వచన పద్యం : లక్షణ నిరూపణం" భారతి, జూలై
7. ,, ,, (1973) వచన పద్యం పద్యమే" భారతి, మార్చి.

# 'సుషుప్తికి స్వస్తి'

శ్రీ బండి రాధాక్రిష్ణ

చుట్టూవున్న చీకటిని మట్టుపెట్టేస్తుంది కొవ్వొత్తి,
నీ కళ్ళ ఎదుటే ఎన్నో 'ఆశల దీపాలు' వెలిగించే పాపలు,
'కోటి సూర్యుల్ని మించే వెలుగు' ను చేరుకుంటున్నా,
వాళ్ళ నోట్లో కనీసం పాలచుక్కల్ని వేయలేని సగటుమనిషీ! నీకు జోహార్లు.

తల్లి దండ్రుల చేతి కందే వాళ్ళు, తండ్రులయ్యేవాళ్ళూ,
కలికం లోకి లేకుండా, 'నీలిరంగు' పులుముకుంటే,
వారివిట్లాచేసిన ఆ 'తీపిమందులు' చేదైనా,
భరించే నీ సహనానికి, ఓ సగటుమనిషీ! నా జోహార్లు.

ఈరోజు నువ్వు తినే తిండిలో రాయి!
రేపు 'బల్లకింద చేతులవాడు'
వేస్తాడొక నిరుద్యోగి గుండెలో రాయి.
ఇవన్నీ 'తామరాకుపై నీటి బొట్టులా' చూస్తూఉండే యోగిరాయా!
భవితవ్యంలేని సగటుమనిషీ! నా జోహార్లు.

వ్యవస్థ మార్చలేనివాళ్ళూ,
నీ అవస్థ తెలియనివాళ్ళూ,
'వైష్ణవ జనతో' అని,—'కీర్తనల జోల'
పాడుతుంటే నిదురపోతున్న
ఓ సగటుమనిషీ, నా జోహార్లందుకో!

నీ బాధలు తీర్చలేకున్నా, గొంతెత్తి అరుద్దామనుకున్న వాళ్ళను,
బురదలోని పద్మాల్లాగా వేరుచేసి, పరదావేస్తుంటే,
రంగువెలసిన విలువలపై నిలిచే ఇటుక సౌధాన్ని కూల్రోయలేని,
నీ బలహీనతకు ఓ సగటుమనిషీ !, నా.జోహార్లు.

కండలు లేకున్నా ! గుండె బలంతో,
నవ్వు ముందుకు ఉరకని నాడు,
నువ్వొక కూపస్థ మండూకం
ఎప్పుడో జారిపడే నీటి బిందువుతో,
కాలేవు ఎన్నటికీ, ముత్యం.
వందల ఏళ్ళ తరువాత దొరికిందిది2,
జారిపోయిందేమో చూడు, భద్రం.

---

1 'గ్లూకోజ్' వల్ల చావులు.

2 స్వాతంత్ర్యం.



కథానిక

# అరటి తొక్క

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం

అతి చిన్నగా కనిపించే విషయాలే ఊహించలేని పరిణామాలకు దారి తీస్తాయి. చేతులు కాలాక కానీ మనం ముట్టుకున్నది నిప్పు సుమా అని కనువిప్పు కలగదు! ఇదే సృష్టి యొక్క ఔన్నత్యాన్నీ మనిషి తాలూకు అల్పత్వాన్నీ తేటతెల్లంచేసే చక్కని అనుభవం. విశ్వానికీ, సర్వసృష్టికీ మూలం ఒక చిన్న అణువు...పరమాణువు... అని శాస్త్రం చెబుతూంటే ఏదో మొహమాటంగా, ఎందుకు పోనీలే అన్నట్లు పైకి 'ఊఁ' అనేస్తామేకాని ఆనిజాన్ని ఓపట్టాన నమ్మలేం. బలహీనత. ఇదే – యీ అవస్థే అటు జీవితానికీ యిటు కథలకీ రంగూ రాణింపూ తెచ్చేది. ఆటంబాంబు ఎంత శక్తివంతమైనదో, ఎన్ని పరిణామాలకు దారి తీయగలదో–అరటితొక్కకూడా అంత విపరీత పరిణామాలకు దారితీయగలదని ఎవరయినా అంటే – ముందు నాకే నవ్వూ అపనమ్మకమూ వచ్చేస్తాయి. మిమ్మల్నెలా నమ్మించ గలుగుతాను?

శ్రీశ్రీ అన్నారు సరే–కాదేదీ కవిత కనర్హం అని. కవితకేం? నేల విడచిన సాము చేయవచ్చు. వింగిలో నాటకాలాడవచ్చు. కథ అలాగ కాదే! చదివిన వారందరికీ అర్థంకావాలి. ఆమోదయోగ్యంగా ఉండాలి. నేటి సాహిత్యం బొత్తిగా కార్లలో షికారు చేసేస్తూండనీ, మధుపానం గావించేస్తూ నిషాలో ఓలలాడుతూండనీ, జీవితంనుంచీ వాస్తవికతనుంచీ దూరంగా బహుదూరంగా పారిపోతూండనీ ఒకవంక సాహితీ విమర్శకులు గగ్గోలుపెటేస్తూ– దిగిరమ్మా దిగిరమ్మా దివినుండి భువికి అని సాహితీలలామను ప్రార్థనలు చేస్తూంటే–బధిరుడిలా, అంధుడిలా...వాస్తవాతీత రచన చేయడానికి నాకెలా మనసొప్పుతుంది? ఆత్మవంచనకీ ద్రోహానికీ పాల్పడేంత నీచుడిని కానే!

నిజం...నిజం...నిజం...నిజం.

నిజమయిన కథ కావాలి. నిజం కథ ఔతుందా? కథ నిజమౌతుందా? కథకి యీ వేషను వెయ్యాల్సివస్తే – నిజమూ వస్ కల్పనా ఎటొచ్చీ దేని నిష్పత్తి ఎక్కువ అన్నదాన్నిబటి కథ అటోయిటో తేలుతుంది. ఈ కథలో ఎక్కువ నిజాన్నీ తక్కువ కల్పననీ రంగరించి మూసపోయా లనే నా ప్రయత్నం. సహృదయంతో ఆలోచించండి.

* * *

అరటితొక్క ప్రయాణ సాధనాలో ఒకటి – అని ఓసారి జోకేశాడు మిత్రుడు. అది–చాలా నిజం. తారురోడ్డుమీద పడున్న అరటి తొక్కమీద ఏమరిపాటున కాలుపడి బరువుమోసిందో – ప్రయాణం తథ్యం. ఆ ప్రయాణానికి టిక్కెట్టు అవసరంలేదు. ఆ వేగానికి లెక్కఉండదు. ఆ ప్రయాణానికి గమ్యమూ అగమ్యమే. అరటితొక్కమీద ప్రయాణం–అందమయిన అమ్మాయి కౌగిటి భాగ్యాని కయినా దారితీయొచ్చు. లేదా ఆక్సిడెంట్ పాలయినా చేయవచ్చు, తెల్లని బట్టలను నల్లబరచవచ్చు. [illegible] కావచ్చు. ప్రతిఫలంలాగ అరటి తొక్క ప్రయాణఫలం చేదువిషమే కావొచ్చు. ...వంతా కాలం తీయవలసిన తెరభాగోతం.

రోడ్డుమీద నడుస్తున్నాడు శంకరం.

రోడంటే–మెయిన్‌రోడ్డే. వీటొచ్చి నేతకానిశేశ మూలాన ...దీ పల్చగా ఉందంతే. రోడ్డు క్లియర్‌గా ఉందికనుక యింగేం, కొద్దీ ప్రయాణ సాధనాలూ ఉత్సాహంగా వేగాన్ని పుంజుకుంటున్నయ్. మళ్లీ మళ్లీ అలాటి అవకాశం లభించదన్నట్టు. స్పీడ్ ఇజ్ డెత్ అని హైవేస్‌వాళ్ళు బోర్డులుపెట్టి భయపెట్టబోతే – స్పీడిస

లైఫ్ అనుకుంటూ చక్రధారులు. స్పీడ్ యీజ్ మనీ అంటూ ఊరి స్తున్నారు వ్యాపారస్తులు. సగటు మనిషికి స్పీడు గురించి తెలుసు కునే సావకాశం తక్కువ.

శంకరం మామూలుమనిషి.

అందుచేత—మామూలు మనిషి కుండవలసిన బలహీనతలన్నీ అతనిలోనూ ఉన్నాయి,

పెళ్ళి కానివాడు కనుక యింకా కొంచం ఆదర్శాలు — ప్రజా సేవ గట్రా అతనిలో మిగిలి ఉన్నాయి. నిజం నిజం నిజం నిజం. పెళ్ళయితే ఎక్కడలేని కాలమూ మెదడూ శరీరమూ పెళ్ళాం సేవకు సరిపోదు. ప్రజాసేవ ఎక్కడ చెయ్యగలడు పూర్ ఫెలో?

ముందే చెప్పాను—అతను సగటు మనిషని.

అతను నిస్వార్థమూర్తి కాదు. అతను చేసే త్యాగాలకు బోలె డన్ని హద్దులూ సరిహద్దులూ విధించబడి ఉంటాయి. ఏ త్యాగం వల్ల తనకి నష్టమూ శ్రమ కలుగనో అటువంటి త్యాగాలు చెయ్య డానికెప్పుడూ అతను సంసిద్ధుడే. అతని జీవితంలో ప్రజాసేవకీ త్యాగాలకీ ఆ మార్జినే ఉంది. అదయినాలేని అనేకులకంటె అతను నయమేకద?

కథకి నాయకుడుండి తీరాలన్న నియమమేమయినా ఉందేమో నాకు తెలీదు, ఐనా యీ కథకి యిద్దరు నాయకులున్నారు. కథకి మూలాధారం - ముఖ్యమూ ఎవరో వారే నాయకులన్న నిర్వచనం సర యినదే అయితే—ఈ కథకి అటు గోపాలమూ యిటు శంకరమూ యిద్దరూ నాయకులే. ఎలాగంటారా, యిద్దరిలోనూ ఏవరు లేక పోయినా ఈ కథేలేదు!

మహిళా సంవత్సరం కనుక—విధిగా సాహిత్య ప్రక్రియలన్నిటి లోనూ స్త్రీకి స్థానం యిచ్చి తీరాలి. అదీకాక—ఈమధ్య పత్రికా సంపా దకు లొకాయన 'మీ రచన చక్కగా సాహితీ విలువలను పోషిస్తూనే నడిచింది కానీ—యిందులో స్త్రీపాత్ర అనేది బొత్తిగా లేకపోవ డంతో మా పాఠకులు హర్షించరని భయపడుతూ దీనిని తిప్పి పంప వలసి వచ్చినందుకూ మీ మనస్సును కష్టపెడుతున్నందుకు చింతి స్తున్నా'మంటూ ఉత్తరం వ్రాసి మరీ నా కథ తిరిగి పంపాడు. నేను సిగ్గుపడ్డాను. జీవితంలోలాగ సాహిత్యంలోనూ స్త్రీకి ప్రముఖస్థానం ఉందని గుర్తించకుండా యిన్నాళ్ళూ రచనలు సాగించేసిన నా అజ్ఞా నానికీ ఆవేశానికీ.

తప్పదు.

వసుదేవుడంతటివాడు గాడిదకాళ్ళు పట్టుకోలేదూ అవస రార్థం? ఏ యెండ కాగొడుగు పట్టాలని పెద్దలు ప్రవచించి పారెయ్యలేదూ?

అందుకని—

తలవంచి—

ఆడవాళ్ళమీద నాకెంత కోపమున్నా అది కాగితంమీదకు కలం ద్వారా కక్కబడకుండా ఉండడాని కవసరమయిన కట్టుదిట్టాలుచేసి—కళ్ళాలు బిగించి—కథానాయికనూ ప్రవేశపెట్టాను. చాలా యుద్ధా లకూ ఘోర పరిణామాలకూ కారణం స్త్రీలే (చూడుడు చారిత్ర. క్లియోపాత్రా, హెలెన్, సీత వగైరా పాత్రలు) కనుక— అటువంటి ఘోరపరిణామాలకీ కథలో అదే కారణం. కనుక—నా కథలో మొదటి నాయిక అరటితొక్క! శాంతం వహించి—వేది చది వితే—రెండవ నాయకి ఎవరో మీకే తెలుస్తుంది. నేను మోసంచేసే మనిషినీకాను, మాయమాటలు చెప్పే రచయితనీకానని మనవి చేసు కుంటున్నాను.

కథలోకి పదండి మరి.

*　　　*　　　*

రోడ్డుమధ్య నడుస్తున్న శంకరం—హటాత్తుగా ఆగిపోయాడు. అతను నిజంగా రోడ్డుమధ్యే నడుస్తున్నాడు (ట్రాఫిక్ రూల్స్ పాటించకుండా. కారణం రద్దీగా లేకపోవడం.

అతని దృష్టి—పడనే పడింది—అరటితొక్కమీద !

అది—చిత్రంగా—తొడిమె పైకి పెట్టుకుని బోర్లా పడిన సంపెంగ పూవుకి ఎన్‌లార్జిమెంటులా ఉంది. నాలుగో ఐదో భాగా లుగా చీలిన తొక్క పచ్చని పసిమి వర్ణంతో మిసమిస లీనుతూంది. అది పడిఉన్న అందమయిన తీరుచూస్తూంటే—ఎవరో జవ్వని—పండు తినేసి—ఏ ఎయిర్‌కండిషండ్ కారులోంచో—అలవోకగా ఆలా విసిరేసి నట్లుంది అందమయిన వేళ్ళకు అరటితొక్క అంటీ అంటకుండా.

ఓనిముషం దాన్ని తదేకంగా పరీక్షించి — అటూయిటూ చూశాడు ఆగి జనం నడుస్తున్నారు. వాళ్ళలో కొందరు తనని చూస్తూనూ ఉన్నారు. ఓసారి తనని తాను కనిపించినంతమేరా పరిశీలనగా చూసుకున్నాడు. ఇంపోర్టెడ్ (మోసం) టెరిలిన్ షర్టు. స్ట్రెచ్ ప్యాంటు...బ్రంట్ షూ... తనకి తనే గొప్పవాడిలా అనిపించేశాడు.

మామూలు మనిషి అలాటి డ్రెస్‌లో ఉంటాడా!

ఉంటాడుంటా దుంటా దుంటాడు. కచ్చితంగా ఉండి తింటాడు. ఎందుకంటే—ఉన్నవాడు ఉన్నట్లే ఉంటాడు — నిండు కుండ తొణకనట్టు.

లేనివాడు ఉన్నవాడిలా ఉండడు. ఉండలేడు.

ఏమీలేక-అన్నీఉన్న ట్లగపడాలనుకునే మామూలు మనిషే ఎన్నో ఉన్నట్టు పపంచాన్ని మభ్యపెట్టబోయి — తనని తాను మభ్య పెట్టుకుంటాడు—భూమి సూర్యునిచుట్టూ తిరుగుతూ తనచుట్టూ తాను తిరుగునట్లు. ఇది—మధ్యతరగతి మనస్తత్వం. శంకరం అటువంటి మనిషే మరి

ఓ పక్క—అరటితొక్కని రోడ్డుపక్కకు విసిరేసి-ప్రజాసేవ చేసేసి—తనముందు తానే షైనయి పోదామని ఉబలాటంగా ఉంది. వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోకూడదని ఆతృతఉంది.

కాని—

ఎవరయినా చూస్తారేమో!

ఏమనుకుంటారు?

ముందుకువొంగి...బెల్బాటమే ఐనా తొడల దగ్గరా—మోకాళ్ళ వరకూ టైటేగా-చిరిగి పోతుందేమో?

అదీకాక—మెయిన్‌రోడ్డు మీద—తనలాటి తను—తనంతటి తను వొంగి—అరటితొక్క అందుకుంటే...

నలుగురూ పిచ్చివాడనుకోరూ?

తన పరువు పోదూ? (ఇదో మామూలు మనస్తత్వమ్. మృగతృష్ణలాటి పరువు ప్రతిష్ఠలను పట్టుకుని ప్రాకులాడేది కేవలం మధ్యతరగతి మనిషే. అటు గొప్పవాళ్ళూ — యిటు పేద వాళ్ళూ కూడా పరువు ప్రతిష్ఠలకూ ఫాల్స్ ప్రిస్టేజెస్‌కీ — డోంట్ కేర్ అనేస్తారు ధైర్యంగా.)

పోతుంది బాబోయ్, పోతుంది.

పరువు పోయాక బ్రతుకేమిటి?

అయో!...ప్రజాసేవ. ఆట్టే శ్రమపడనవసరం లేకుండా ఎంతో ప్రమాదాన్ని తప్పించుకోవచ్చు—చిన్నపనిచేసి.

ఇటువంటి మహదవకాశం మళ్ళీ మళ్ళీ వచ్చేదికాదు.

ఈ అరటితొక్క యిలాగ యిక్కడుంటే-ఎవరో ఒకరు కాలు వెయ్యకమానరు. ప్రమాదం జరగకమానదు. ఆ మనిషికి కాలు విరగొచ్చు. చెయ్యి విరగవచ్చు. జీవికే పోవచ్చు.

అలాగ జరగకుండా కాపాడాలి తను.

మనిషిగా యిది తన కనీస ధర్మం. ఔను.

చుట్టూ చూశాడు శంకరం.

రోడ్డుమీద అందరూ తననే పట్టిపట్టి చూస్తున్నట్లనిపించింది.

కామెర రోగికి లోకం పచ్చగానే కనిపిస్తుంది మరి. మనసులో అనుమానం ఆవరిస్తే—నీడని చూసీ త్రుళ్ళిపడతారు మనుషులు. అవకాశం...వినియోగించుకోవాలి. జారవిడుచుకో కూడదు. అవకాశాలూ అమ్మాయిలూ—నిర్లక్ష్యం చేసుకుంటే మళ్ళీ మళ్ళీరావు. బెల్‌బాటమ్ కాబట్టి తను ఈ అవకాశం పొందాడు. వినియోగించుకునే వీలుకలిగింది. ఇదే స్ట్రైట్ జీన్, ఐతే ఆలోచించడానికీ లేదు. స్ట్రైట్‌ప్యాంట్‌తో వొంగుని అరటితొక్క తియ్యడం సర్కస్‌వాడికి సాధ్యమేమోకాని సామాన్యుడి కసాధ్యం. థాంక్స్ ఫర్ద ఎలిఫెంట్‌బెల్.

ఒక్కసారి అందరూ కళ్ళు మూసుకుంటే బాగుండును. తను అరటితొక్కని తీసి అవతలకు విసిరి వేసేవాడు

శంకరం—టుడు ఆర్ నాట్టుడు లో కొట్టుకొంటున్నాడు.

కొడుకు చావకూడదు, కోడలు ముండమొయ్యాలి.

వరువు పోకూడదు - ప్రజాసేవ చేసెయ్యాలి.

ఎలా? ఎలా? ఎలా? ఎలా?

మూడు నిముషాలు గడిచాక—

మెదడు ఇంజన్‌లా వేడెక్కాక—

హా, తెలిసెన్!

ఐడియా వచ్చేసింది.

శంకరం పెదవులమీదకు చిరునవ్వు పాకేసింది.

కళ్ళు గర్వంతో కొవ్వొత్తుల్లా వెలిగాయి.

వన్...టు...త్రీ!

ఒకటి...రెండు...మూడు!

ఏక్, దో, తీన్!

కుడికాలుమీద ప్యాంటు పైకిలాగాడు కొద్దిగా.

శంకరం—చిన్నప్పుడు ఫుట్‌బాలాడినవాడే.

అరటితొక్క బంతిగా భావిస్తూ—పొజిషన్ చూసుకున్నాడు.

సరిగా రోడ్డుమధ్యగా ఉంది. ఐదారు గజాలదూరం అది విసిరితే- నిశ్చయంగా కాలవలో పడుతుంది.

ఐదారు గజాలు. సరిగ్గా అంతే.

దమ్ము బిగబట్టాడు.

దృష్టి కేంద్రీకరించాడు.

మందహాసం చిందించాడు.

రోడు మధ్య ఉన్నాడతను.

అటూ యిటూ అతివేగంగా—లారీలూ రిక్షాలూ...శర వేగంతో పరుగులెడుతున్నాయి.

కుడికాలు వెనక్కిలాగి-కళ్ళుమూసుకుని...

ఒక్కకిక్...

కొన్ని క్షణాలు.

కీచుమన్న—కర్ణ కఠోరమయిన శబ్దం.

కెవ్వున కేకలు.

గొల్లున గోల!

హాహాకారాలు.

కళ్ళు తెరిచాను కంగారుగా.

ఓ మోటారు సైకిలు రోడు మీద పడిఉంది దానికింద ఓ యువకుడు. ఆ పక్కనే—పొరపాటున తీగెనుంచి జారి బురదలో పడిపోయిన పన్నజాజిలాటి అమ్మాయి-ఏడుస్తూ-బట్టలనంటిన దుమ్ము దులుపుకుంటూ

మోటారు సైకిలు చక్రానికి — ఋణదాతని వదలని అప్పారావులా.

అరటితొక్క! - నలిగి నలిగి...

అర్థమైపోయింది శంకరానికి.

ఆపాదమస్తకమూ కంపించిపోసాగాడు.

చేష్టలుడిగి — కరచరణాలాడక — కొయ్యబొమ్మలా మిగిలి పోయాడు.

అమ్మాయి—అతనినే చూస్తోంది.

ఆచూపులు శూలాల్లా బాకుల్లా అతని హృదయాన్ని చీలుస్తున్నాయి.

భరించలేకపోతున్నాడు.

భయపడిపోతున్నాడు—అమితంగా.

మరుక్షణం ఏం జరుగుతుందో ఊహించుకోలేక పోతున్నాడు.

అతని పరిస్థితి వర్ణనాతీతంగా ఐపోయింది.

తానొకటి తలిస్తే దైవమొకటి తలిచింది.

ప్రజాసేవచేయబోయి—ప్రాణాలు బలికొన్నాడు.

మోటారుసైకిలు చుట్టూ మనుషులు...

ప్రమాదం—తనకీ తనవారికీ కానంతవరకూ మహాచెడ్డ కుతూహలం!

అదే తమకయితే? భయం...దుఃఖం...శోకం...

వింత మనుషులు.

"దెబ్బ పెద్దది కాదుకానీ తగలకూడనిచోట తగిలినట్లుంది ప్రాణం పోయింది—"

"ప్రాణం పోదల్చుకున్నప్పుడు ఏదెబ్బా తగలక్కరలేదు. మొన్న మా దూరపు చుట్టం - పేపరు చదువుతూ సిగరెట్ అంటించి — రెండోదమ్ము పీల్చకుండానే కన్నుమూసేశాడు."

వ్యాఖ్యానాలు.

పోలీసులు వచ్చారు.

శంకరంవైపు ఆ అమ్మాయి తీక్షణంగా చూసో ంది దుఃఖపు పొరల్లోంచి.

అతనామెను చేరి—"దయచేసి మీరు గొడవ చెయ్యకండి. నేను మీకు చాలా క్షమాపణలు తెల్పుకోవాలి. అంతేకాదు—యింకా చాలా బాధ్యతఉంది. తప్పకుండా నిర్వర్తిస్తాను. ఇది అనువైన సమయమూ కాదు, పరిస్థితికాదు ఈ హడావిడి తగ్గి —పోలీసులు వెళ్లిపోయాక..." కన్నీరొక్కటే తరవాయి. ఆవంతు అతని గొంతుక రుద్ధం అవనే ఐంది.

ఆమె—కొంచెం ఆలోచించి— "నాపేరు వసంత... నిజంగా మీరు మీ బాధ్యత నిర్వర్తిస్తానని వాగ్దానం చెయ్యండి." అంది మెల్లగా. చేయిజాపి వొట్టు వెయ్యబోయి. మలివచ్చి, చెయ్యి వెనక్కి లాక్కుని "నేను నీచుణ్ని కాదు వసంతగారూ! నాపేరు..."

మీరు నాకు తెలుసు—." ఆగి— "నాలుగైదు నెలలనుంచి—" అందామె.

తెల్లబోయాడు శంకరం. "నేను మీకు తెలుసా! ఎలాగ ?"

అంత దుఃఖంలోనూ ఆమె అతనివంక జాలిగాచూసి— "మీరు వెళ్ళండి. చాలా కంగారుపడుతున్నట్టున్నారు" అంది.

"మిమ్మల్ని వదిలేసి..."

"చూడండి... మనిషి జీవించడానికి యీరోజుల్లో చాలా ఫిలాసఫీ అవసరం· అదినాకుంది. మీరిప్పుడు నాగురించి చింతించ నక్కర్లేదు. నాకెలాగూతప్పదు. మీరుకూడా పోలీసుల గొడవలో చిక్కుకోవడం దేనికి ? వెళ్లండి. పోయిన ప్రాణం ఎలాగూ తిరిగి రాదు-"

శంకరమ్-ఆశవాన్ని చూడకుండా ఉండడానికే శతవిధాల ప్రయత్నించాడు. బోర్లాపడటాన ముఖం-పోలికలూ తెలియడంలేదు

వసంత మాటలతో అతనికి తాత్కాలికంగా ధైర్యమూ శక్తీ వచ్చాయి. త్వరత్వరగా నడిచి అతను తనరూముచేరుకున్నాడు.

ఓమనిషి ప్రాణం తీసిన నేరానికతను ఆపూట భోజనంమానేసి తనను తాను శిక్షించుకున్నాడు. దానుని తప్పు దండం (దణ్ణం?)తో సరికదా ?

తనని పోలీసు కేసులో యిరికించనందుకు - వెంకటేశ్వరస్వామి కోవెలకువెళ్లి మూడు కొబ్బరికాయలు కొట్టించాడు భక్తిగా లెంప లేసుకుని - యిలాగే యికముందూ కాపాడమని.

తెల్లవారింది.

అరువుతెచ్చుకున్న పేపరు చదివే కాఫీవేళ.

శంకరం—హోటల్లో పావలా కాఫీ తాగుతూ—అంతేకిదువేసే పేపరు స్వంతపేపరంత ధీమాగా చదివేస్తూ ఆగిపోయాడు. కారణం...ఓ వార్త.

గోపాలం అనే కలక్టరేట్‌క్లర్క్—అరువుతీసుకున్న మోటారు సైకిలుమీద వసంత అనే స్నేహితురాలితో వస్తూ — నైహాచౌక్ సమీపంలో—మెయిన్‌రోడ్‌మీద టైర్‌స్కిడ్ అయి-ఓ ఎలక్ట్రిక్ పోల్‌కి కొట్టుకుని తక్షణం దుర్మరణం చెందాడు. వసంతకి చిన్న గాయం మినహా ఏ ప్రమాదమూ జరగలేదు. స్వ. వి.

శంకరం ఆ వార్త చదివి ప్రాన్పడిపోయాడు.

కాఫీ గొంతు దిగడమే కష్టమైంది. ఇక పేపరు చదవబుద్ధి కాలేదు.

ఒక్కసారిగా అతని నేరం—వందల, వేల...లక్షల...కోట్ల రెట్లయిపోయి అతన్ని బాధించసాగింది.

నిన్న — తనమూలంగా జరిగిన యాక్సిడెంటులో ప్రాణం పోయింది ఎవరోకాదు. గోపాలం! తన చక్కని మిత్రుడు. చెబురారా తను అతని నిండు ప్రాణాన్ని...

భరించలేకపోయాడు శంకరం ఆ ఆలోచనని. వేడుకున్నా— వేదాంతమూ వైరాగ్యమూ అతని ఆవేదనకు ఆనకట్ట వేయలేక పోయా యి.

పది పదిహేను రోజులకి—గోపాలాన్నీ ప్రమాదాన్నీ అందరూ మరచిపోయారు—శంకరమూ కొద్దిమందీ తప్ప.

పోలీసులూ—ప్రమాదంగా తేల్చివేశారు.

అంతా మామూలుగా ఉన్నది వాతావరణం.

ఆ సాయంత్రం వచ్చింది వసంత—శంకరంగదికి.

భయంగా, సిగ్గుగా ఆహ్వానించాడు ఆమె నతను.

"మీరు—వాగ్దానం మరచిపోలేదనే నమ్ముతున్నాను."

"ఊఁ..." తప్పుచేసి సిగ్గుపడుతున్న వాడిలా అన్నాడతను.

"గోపాలం నేనూ పెళ్ళి చేసుకుందామని నిర్ణయించుకున్నాం. ప్రమాదమే జరగకపోతే జీవితాలు మరోలా ఉండేవి."

"అవును—"

ఇప్పుడు—చాలా సవరణలూ మార్పులూ అనివార్యం అయిపోయాయి. శంకరంగారూ: గోపాలంద్వారా మీరు నాకు పరిచితులే. నేను కొంచెం ముక్కుసూటి మనిషిని. సూటిగా అడిగేస్తాను. సమాధానం యిస్తారా?"

ఆమె ఏం ప్రశ్న వేయబోతూందో అని వెయ్యిభయాలతో ఎదురు చూడసాగాడతను,

"ఈ కాలంలో ఆడపిల్ల పెళ్ళి కావడం ఎంత కష్టమో మీకు తెలుసనుకుంటాను. దాదాపు పీటల అదే—రిజిస్ట్రారాఫీసు వరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోతే—నాలాటి ఆటే అందంగా ఉండని... స్థిరమైన ఉద్యోగంలేని—అమ్మాయి భవిష్యత్తు ఏమౌతుందో కాలానికే తెలియాలి."

అతను—ఆమెవంక చూశాడు.

"ఆ ప్రమాదం జరగకపోతే నా జీవితానికి భద్రత లభించేది గోపాలం చాటున. మనిషి ముఖ్యంగా స్త్రీ-సెక్యూరిటీకోసం ఎంత తాపత్రయ పడుతుందో మీకు చెప్పనక్కరలేదు. కనుక..."

అర్థమైపోయిందతనికి.

అతని కళ్ళముందు అరటి తొక్కలు...వందలు...వేలు... తోరణాలుగా వేలాడుతున్నాయి.

గజగజ వొణికిపోతూ— "దయవేసి కొంచెం వ్యవధివ్వండి. వారంలోగానే నా నిర్ణయం చెబుతాను..." అన్నాడు.

"అలాగే." అని ఆమె నిష్క్రమించింది.

శంకరం మెదడులోకి కోపంగా వచ్చింది రాధ.

"నా ప్రేమసంగతేమిటి శంకరం?"

"క్షమించు రాధా. జరిగిన ప్రమాదం నీకూ తెలుసు. నా అంతరాత్మముందు నేనే దోషిగా జీవించడం నా తరంకాదు ప్రేమకంటె ముఖ్యమైనవి జీవితాలు. గోపాలాన్నెలాగూ పోగొట్టుకున్నాను. వసంతకి అన్యాయం చెయ్యలేను..."

"శంకరం!"

"క్షమించవూ రాధా?"

ఆమె—అశ్రువులు నిండిన కళ్ళతో అంతర్ధానం అయిపోయింది.

వసంత—బలీయంగా అతని మెదడునీ మనసునీ కూడా ఆక్రమించుకోసాగింది.

వారం తిరగకుండానే శంకరం—వసంతకి తన నిర్ణయాన్ని చెప్పేశాడు.

వసంత—సంతోషించనూలేదు, దుఃఖించనూలేదు.

(ఈ రచన నా స్వంతం. దేనికీ అనుకరణా అనుసరణాకాదు.

# మాదిరాజు వారి 'ఆనందధుని'

## శ్రీ శివలెంక ప్రకాశరావు

ప్రతిజీవీ ఈ భూమి మీద పడింది మొదలు మళ్ళీ ఆ పరమాత్మలో లీనం అయ్యేంతవరకూ, సముద్ర గర్భంలో కలిసే నదిలాగా తన శక్తి యుక్తులన్నీ ఉపయోగించుకొని ప్రతికూల వాతావరణాన్నీ, పరిసరాలనూ తన కనుకూలంగా మార్చుకొంటుంది. ఇదంతా జీవి ప్రతి క్షణమూ మృత్యుదేవత కబంధహస్తాలలోంచి తప్పించుకోవడానికి కొనసాగించే జీవయాత్ర. ఇట్లాంటి ప్రయత్నంలో పొందిన సంపూర్ణ విజయానికి ఒక ప్రతీకవంటిదే 'సతీసావిత్రి కథ.'

వ్యాసప్రోక్తమైన ఈ కథను అరవిందులు ఒక ఆధ్యాత్మిక ఆధునిక మహాకావ్యంగా మలచినారు. అరవిందుల దృష్టి లో సావిత్రి సాక్షాత్తు గాయత్రీ స్వరూపిణియగు సావిత్రియే! మృత్యువునకూ, పునర్జీవనానికీ ఒక సేతువు. తమస్సును హరించిన ఒక దివ్య కాంతి. అశ్వము ఆధ్యాత్మిక శక్తికి ఒక ప్రతీక. అందుకనే అశ్వపతి ఆత్మజా సంకోసం నిరంతరమూ అన్వేషించే ఒక సాధకునకు ప్రతీక. అతడొనర్చిన పద్దెనిమిది సంవత్సరాల తపశ్చర్య ఒక ఆధ్యాత్మిక యోగసాధన.

ఇట్లాంటి మహద్గ్రంథాన్ని చదివిన తరవాత మాదిరాజ రంగారావుగారికి కలిగిన భావపరంపరయే ఈ 'ఆనందధుని' కావ్య స్వరూపం.

ఒక విశేష దశలో మనస్సుపొందే ఆరోహణల పరంపరను మానవుని జీవయాత్రగా భావించి దీనిని మూడు దశలుగా కవి విభజించినారు. ఇటూ విభజించటంలో ఒకవిశేషమున్నది. అరవిందుల అశ్వపతి సంతానంకోసం చేసిన యోగాభ్యాసము మూడు భాగాలు అందులో మొదటిది వ్యక్తిగా ఆధ్యాత్మిక సిద్ధిని పొందడం. రెండవది మానవుల ప్రతినిధిగా చైతన్య భూమికలను సాధించడం. ఇక మూడోది విశ్వమంతకూ దివ్యచైతన్యం కలిగి నూతనసృష్టి జరిగే విధానాన్ని కనుక్కోవడం.' మనస్సు కతీతమైన ఈ తత్త్వాన్ని అతి మానసమంటారు అరవిందులు.

'తైత్తిరీయోపనిషత్తులో చెప్పిన అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలలో విజ్ఞానమయం బుద్ధికాదనీ, అదే అతిమానసమనీ అరవిందుల అభిప్రాయం.

ఈ సర్వజగత్సృష్టి కీ 'జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి' అను మూడునూ అత్యంతావశ్యకములు. మొదటిదగు జ్ఞానమును బట్టి సృష్టి చేయవలెననెడి ఇచ్ఛ, దానినిబట్టి క్రియారూపము ధరించుట సంభవించును. జ్ఞానేచ్ఛల సమన్వయ స్వరూపమే ఒక మహాశక్తి. కావున 'అతిమానసమనగా జ్ఞానేచ్ఛల రూపమున వెలికి విస్తృత మగు సచ్చిదానందమే'!

ఈ సృష్టిలో అతిమానస దివ్యచేతన మూడు రూపములను ధరించినట్లు కనవచ్చు. అందులో మొదటిది వస్తుజాతపు అఖండైకత్వమున ప్రతిష్ఠితమైన రూపము రెండవది ఏకమున అనేకము, అనేకమున ఏకము అభివ్యక్తమగుట కాధారమై విలసిల్లునట్లుగా ఆ ఏకత్వమును మలచిన రూపము. మూడవది నానావిధములగు వ్యక్తిత్వావిష్కారమున కాధార భూతమగునట్లుగా ఆ ఏకత్వములో మార్పుచెందించిన రూపం. అసలు సావిత్రి మహాకావ్యమే మూడు భాగాలుగా అరవిందులచే వ్రాయబడింది. 'ఆయన దృక్పథానికి మూడు ఆధారాలున్నాయి. పరిణామక్రమం క్రిందునుంచి ఎలా పైకి పోతున్నదో, అలాగే పైనుంచి క్రిందికి దిగటంకూడా ఉంది. ఇది రెండూ ప్రక్కప్రక్కనే జరుగుతూ ఉన్నయి అనేది మొదటిది. రెండవది: ఈ ప్రయాణాలో ఏ దశకా దశలో ఒక ఐక్యత, ఒక పూర్ణత కనబడుతుంది. మూడవది: అతీత మనసు [Super mind] భావన. ఈ మూడింటి ఆధారంగానే దాదాపుగా వారి ['The life divine'] రచన సాగింది!

ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని మాదిరాజువారు 'ఆనందధుని' మూడు భాగాలుగా విభజించినారు.

మొదటిది పరిమళవలయం. ఇది మనస్సుకు ప్రతీక. ఆధ్యాత్మిక యోగసాధనలో తొలిమెట్టు మనస్సేగదా! సంకల్ప వికల్పాత్మకమైన అంతఃకరణమే మనస్సు.

'ఈక్షణం మేల్కొంది
కాంతిబిందువై
సాగింది రేఖలుగా
కరగిస్తూ తమోరాశి' అంటూ ప్రారంభించబడింది. అవిద్య కారణంగా నిజాత్మ మానసిక అహంకారంచే కప్పబడి ఉంది. అదే 'తమోరాశి.' అది కరిగి నిజాత్మను పొందితేనేతప్ప దివ్యజీవనంరాదు.

'మనస్సు భేదదృష్టి ప్రధానం. సచ్చిదానందను ఏకత్వ లక్షణోపేతం. ఈ రెంటికీ సామరస్యాన్ని చేకూర్చే తత్వమే అతిమానసం.' 'మనపరిణామం సచ్చిదానందంనుంచి మొదలుపెట్టి—పదార్థము, ప్రాణము, మనస్సుదాకా వచ్చి ఆగింది. ఒక్కదూకు దూకి ఈ మనస్సు—అతీతమనస్సును, అక్కడనుండి సచ్చిదానందమును అందుకుంటే పరిణామక్రమం పూర్తవుతుంది.'

అందుకే ఇది చదివేసరికి కవిమనస్సులో ఏదో ఒక కాంతిరేఖ ప్రవేశించి పూర్వమున్న తమోగుణం నశించింది. అంతవరకూ అనుభూతి కందని ఒక మనోజ్ఞ రూపం హిరణ్య గర్భంనుంచి ఓంకారం వలె పుట్టి ఆత్మకు ఆనందాకృతిని ఇచ్చింది. ఎక్కడయితే సూర్యాది తేజస్స్వరూప పదార్థాలుంటాయో అదే హిరణ్యగర్భం.' అందుకే కవికి ఈ 'కల్పన వాస్తవంగానూ, స్థావరం జంగమంగానూ, శూన్యం సంభృతంగానూ కనబడి, కాలం తెలివి పొందింది' అన్నట్టు ఒక దివ్యానుభూతి కలిగింది. 'లౌకిక వనమంతా కొత్త తెలివితో చిగురించి, వాస్తవ జగత్తనిపించింది. చీకటి వెలుగులో కలిసిపోయి ప్రకృతి కొత్తకాంతులను విరజిమ్ముతోందన్నట్టు కవి అనుభవ దర్పణంలో ప్రతిబింబించింది.

'అతి మానసచేతన మొదటి దశలో నామరూపాలన్న వేరుగా కాక, ఆ అనంత దివ్యశక్తి విశుద్ధభావనారూపాలుగా వెలొందుతాయి'. అంటే ఈ స్థితిలో చిదాత్మకూ, శక్త్యాత్మకూ భేదముండదు. జడవస్తువిది, ఇది ఆత్మవస్తువు అనే భేదం కనబడదు. సర్వమూ ఆత్మయొక్క రూపవిశేషంగానే భాసిస్తుంది.'

ఇంకాకొన్ని క్షణాలు 'నింగిలో కదలిపోయే మబ్బుల్లా' గడిచిపోయేసరికి జీవిత చక్రం ఎగజిమ్మిన దుమ్మంతా అణగిపోయి ఆత్మతేజం వెలుగొందింది కవికి. నిద్రాగుహనుంచి మనస్సు బయటపడింది. అంటే ధర్మం మేల్కొన్నదన్నమాట. గుహ తమో గుణానికీ, నిద్రాణమైన ధర్మానికీ ఒక ప్రతీక. ఎప్పుడయితే మనస్సు నాక్రమించిన తమస్సు విడిపోయిందో, అప్పుడే జీవితాన్వేషణలో పొందిన అశాంతి వలయం చెరిగిపోయింది. అహంకారమూ, జయమూ అణగిపోయి ప్రశాంతత ఏర్పడింది.అందుకే 'మొక్కకు వెలుగూనీరూ' ఎంత ముఖ్యమో 'మెలకువకు అనుభవం, వివేకం' అంతే ముఖ్యమంటాడు కవి. సావిత్రి కథలోకూడా ఆమె వివేకంవల్లనే యముడు మారాడు కదా!

మానవుడు నిత్యమూ సాగించే జీవన్మరణ పోరాటం సురాసురుల సంఘర్షణవంటిది. రాపిడివల్ల నిప్పుపుట్టినట్టు, ఈ సంఘర్షణలోనే జీవితసత్యానికి ఒక ఋజుమార్గం దొరుకుతుంది. ఈ 'పథంలోని మానసికమైన సుందరశిల్పాలే దేవతలు.' అంటాడు కవి. మనము నిత్యమూ ఆరాధించే వస్తువే మన మనఃఫలకంపై ఒక రూపాన్ని చిత్రీకరించుకుంటుంది. అదే మనకు ఆరాధ్య దేవతగా పరిణమిస్తుంది.

అతి మానస చేతనం యొక్క ప్రథమదశలా ఉండేస్థితిని కవి ఇలా వివరించారు.

'ఇక్కడ ఎక్కడఉంది
వివిధవస్తువిభేదం
ఉంది ఇక్కడ ఒకటే
ఆత్మ కథావైవిధ్యం.

మౌనానికీ ధ్యానానికీ
వ్యాఖ్యానంగా ఉందిస్థితి
లౌకికమూ వాస్తవమూ
దాటుతున్నాయి మనోదశలు...'

అంటే ఆత్మస్వరూప మొక్కటే శోధిల్లుతున్నదన్నమాట. ఇదే నిర్గుణ పరబ్రహ్మస్వరూపం. ఇందులో సగుణోపాసనలో ఉండే విభేదాలు కానరావు. ఇదే అశ్వపతి మహారాజు పొందిన ఆగిశక్తి దివ్యానుభూతి. అదే కవికూడా పొందినాడు. ఈ స్థితి 'బరువు మోసుక

పోయేవాడు మధ్యలో దించుకొని కాసేపు విశ్రాంతి పొందుతున్నట్లుంది' ఇందులో మానవ శరీరానికి ఏ చీకూచింతా లేదు.

ఇంకా కొన్ని క్షణాలు గడిచాయి.

'ప్రకాశమాన ఆలోచనకూ
క్రియాత్మక వర్తనకూ మధ్య
సూక్ష్మలోకం మంచుతెరవలె
మృత్యునిరంకుశత్వంమండి
స్వాతంత్ర్యం పొందింది మనసు'

'సచ్చిదానందంలోవున్న సత్యాలను దర్శించి వాటి అభివ్యక్తి స్వరూపాన్ని నిర్ణయించడానికి జ్ఞానశక్తి తోడ్పడుతుంది. నిర్ణయింపబడిన వాటిని ఆయా దేశకాలాలలో అభివ్యక్త మొనర్పడానికి ఇచ్ఛాశక్తి' పనిచేస్తుంది, ఇటూ 'సచ్చిదానందంలో అంతర్నిహితంగా వున్నదానికి ఒక రూపమిచ్చే జ్ఞానమే ఋతచిత్. అదే సంకల్పం. అది తపశ్శక్తి సమన్వితం. ఈ దివ్యచేతనలో ఒప్పు తత్త్వమే ఈశ్వరుడు.' మనస్సులో ఆతనియందు సంకల్పం కలగడమే మృత్యుగహ్వరంనుంచి విడివడటం. అందుకే కవి 'గగన రహస్యం బద్దలైందనీ, శబ్దధుని ఆవహించింద'నీ అంటాడు. ఈ స్థితిలో మనస్సొక అందమైన ప్రవాహ రూపంగా మారి, ఎదలో సాగిన వాంఛాలత కళ్ళలో పుష్పించింది. ఆశలు పసిడి మొగలిపట్టలవలె వికసించాయి'.

దాంతో 'తలయెత్తిన ఆశ్చర్యంతో
నిలిచింది స్వరం క్రిందికి దిగి';

అంటే సచ్చిదానందం క్రిందికి దిగిందన్నమాట. దీనికి అరవిందుల 'The Divine descends from pure existence through the play of Consciousness-Force and Biss and the Creative medium of super-mind into Cosmic being; we ascend from Matter through a developing life, soul, and mind and the illuminating medium of super mind towards the Divine being.' (The Life Divine— The seven fold of Being — Chapter 27)మాట లాధారము.

మనస్సప్పుడు ఒకవిధమైన 'అవిచ్ఛిన్న సంస్కారగంధం' పొందింది. భూమిని ఆకాశంవలె, ఆకాశాన్ని కాంతివలె ప్రకృతిని అనంతశక్తి' పరుసవేదిగా స్పృశించింది. ఆధ్యాత్మిక శక్తిముందు ప్రకృతిశక్తి తలవొంచింది. దాంతో 'ఆదర్శానికీ, వాస్తవికతకూ, ఆత్మకూ, శరీరానికీ అవినాభావ సంబంధం' ఏర్పడింది. జీవిత గమన రీతిలో,హృదయస్పందనలయతో, శబ్దాలు తొలిచిచేసిన రమణీయ రసాకృతి మంత్రాక్షర ముఖంతో మనోవలయం' దాటింది ఆ దివ్య శక్త్యాత్మక స్వరూపం తన శక్తియుక్తులను ప్రసాదించటమే ఇది. 'నిశ్శబ్ద వలయం చీల్చుకొని స్వరతరంగాలు ఒక సంగీత చిత్రంలా' అవతరించింది. దాంతో 'స్వర్లోకం శారీరక జగత్తును స్పృశిస్తూ కదలిపోయింది. జననాంతర వాసనాబలంతో హృదయాకాశం వెలుగొందింది.'

ఆ సమయంలో కలిగే అనుభూతినే

'శక్తిసౌందర్యకాంతి
ప్రవహిస్తోంది నాలోకి
ఆనందసుమ పరిమళం
ప్రసరిస్తోంది నానుండి'

అనే పదాలో ప్రతిధ్వనింపచేసినాడు కవి. ఆదిశక్తి సాక్షాత్కారంతో అశ్వపతి మహారాజు పొందిన ఆత్మజ్ఞాన ఘట్టం చదివినప్పుడు కవికి కలిగిన ఆనందానుభూతియే ఇది.

ఈ 'పరిమళ వలయం' మూడు ఘట్టాలుగా విభజించబడింది. సప్తవ్యాహృతులుగా చెప్పబడిన భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం —అనువాటిలో మొదటి మూడునూ శరీరప్రాణ మనస్తత్వములకూ, చివరిమూడునూ సత్య తపోజనుర్లోకములు, సచ్చిదానందములకు సంజ్ఞలు. నాల్గవదియగు మహస్సే అతిమానసానికి సంజ్ఞ' అన్నారు అరవిందులు. ఇది 'అపరార్థ, పరార్థాలకు ఒక వారధిగా ప్రకాశిస్తోంది' అరవిందుల దృష్టిలో. శరీరప్రాణ మనస్తత్వాలకు ఏర్పడిన సమన్వయ దృక్పథమే ఈపరిమళ వలయం. అదే 'స్వర్లోకం కదలిపోతూంది స్పృశిస్తూ శారీరక జగత్తును' అనే పదాలలో ధ్వనిస్తోంది.

'మనస్సు (mind) అతీత మనస్సు (super mind)కు చేరే ముందు ఉన్నత తర మనస్సు (Higher mind), ప్రకాశాన్విత మనస్సు (Illumined mind), స్వతఃస్ఫురణ మనస్సు (Invitive

mind), ఉపరిమనస్సు (Over mind) అనే 4 మజిలీలు చేయా లంటారు అరవిందులు'.

ప్రపంచమంతటా ఒకే ఆత్మతత్త్వము నిండిఉన్నది. కాని దాని రూప విశేషాలు మాత్రం అనేకం. ఇట్లా 'కేంద్రీకృతమైన చిదాత్మయే, సర్వాత్మకమైన పరమాత్మకంటె వేరయిన జీవాత్మ. ఈ భిన్నత్వం సృష్టిలో వ్యావహారిక ప్రయోజనానికేగాని, వస్తుతః వేరుకాదు. సర్వాత్మకుడైన పరమాత్మ అన్నిజీవాత్మలూనూ తానే అని తెలిసియుండును. అయినప్పటికీ ప్రతిజీవాత్మతోనూ ప్రత్యేక సంబంధాన్ని పెట్టుకోవడంతోపాటు, ప్రతిజీవాత్మలోనుంచీ ఇతర జీవాత్మలతోకూడ సంబంధాలను పరమాత్మ నెలకొల్పు కొంటాడు. ఇక జీవాత్మ తానా పరమాత్మయొక్క ఒక రూప విశేషమే అన్న విషయం తెలిసికొని, అటు ఆ పరమాత్మతోనూ, ఇటు ఇతర జీవాత్మలతోనూ తన ఏకత్వం అనుభవించ గలిగటంతోపాటు, ఆ ఏకత్వంలోనే భిన్నత్వంలో తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నెలకొల్పుకొనుచూ ప్రత్యేక సంబంధాలను కలిగిఉండే స్థితిలో ఉంటుంది'. అంటే అతి మానస దివ్య చేతనయొక్క రెండవదశలో 'వ్యష్టిత్వ భావనను కోల్పోకుండానే మన ఆత్మ, ఆ పరమాత్మతో ఏకత్వాన్ని అనుభవిస్తూ తన ప్రత్యేక వ్యక్తిత్వానకూడా అటుపరమాత్మతోనూ, ఇటు ఇతరుల తోనూ ఏకత్వానుభూతిని పొందగలుగుతున్నమాట. అదే ఏకము అనేకంగా అభివ్యక్తమై, అనేకమింకా ఏకంగా ప్రకాశించడం'.

ఇదే ఆనందధునిలో 'ఇక్కడ ఎక్కడా లేదు చీకటి' అనే ద్వితీయఘట్టం. ఇది అంతఃకరణానికి ప్రతీక. పరంధామునితో సంబద్ధమైన ప్రకృతియే అంతఃకరణం.

'ఆలోచనాజల తరంగాలపై
శ్రేణులుగా రహస్యరూపాలు
వేసుకున్న ముసుగులు వదలుతూ
ఆలోచనా వాయు వీచికలపై
గుంపులుగా రహస్యరూపాలు
వేసుకున్న ముసుగులు తగలబడుతూ'

అంటూ ప్రారంభించబడుతుంది.

ఇక్కడ 'రహస్య రూపాలు వేసుకున్న ముసుగులు వదలడం అంటే జీవాత్మ 'అహం' భావాన్ని (నేనేజ్ఞాతనని గ్రహించడం) వదిలి, అవిద్యమూలంగా ఏర్పడిన అజ్ఞానం నశించి, తాను ఆ పరమాత్మయొక్క అంశీభూతాన్నని (సోఽహం) తెలుసుకోవడం. ఈ సంస్కారవాసనాబలం ఒక్కనాటితో వచ్చేది కాదు. ఇది ఎన్నో జన్మలనుంచి తెచ్చుకున్న సంచితం. అందుకే 'వర్తమాన గగనతలంపై వెలిగే సూర్యగోళానికీ, మెరిసే చంద్రబింబానికి' వీటి స్వరూపం బాగా తెలుసంటాడు కవి. అవే మనకు సాక్ష్యమన్నమాట.

జీవాత్మ పరమాత్మల ఏకత్వాన్ని కళ్లకు గట్టిస్తూ ఇక్కడ కవి గీచిన భావచిత్రం చూడండి. ఇది కవిశిల్పాన్ని తెల్పుతుంది

'శ్రేణులుగా రహస్య వలయ లు
ఎన్ని యుగాలనాటివో
జలధారా భావనలో
ఆరోహ స్వరాలతో
అవరోహ రాగాలతో
మ్రోగే సంగీత చి తమై
నిష్క్రమిస్తూన్న మృదుధ్వని'.

తరవాత జీవాత్మ తన వ్యక్తిత్వాన్ని నెలకొల్పు కొంటుంది. అదే 'మింగింది ఆశ్చర్యాన్ని ఆనందం నృత్యంతో' అనే పదాల్లో కనిపిస్తుంది. ఇది 'భూమికి క్రొత్త జీవనాన్ని ఇచ్చే తొలకరిలా ఉందంటాడు కవి.

ఇదే సందర్భంలో 'పరంపరగా అడుగడుగున దాగిన కవితా నిధులు అర్ధరాత్రం గాలుల సవ్వడివలె మనోభూమినుండి స్మృతులు బయటికి తీస్తున్నాయి' అంటాడు కవి. నిజంగా, అనుభూతి సౌందర్యంపైనే కవిత జీవిస్తుంది.' ఎందుకంటే 'అనుభూతి అంతరిక్ష సంచలనం కలిగి ఉంటుంది. ఇది ఆత్మలోతుల్లోకి ప్రయాణం చేస్తుంది.' అందుకే 'అర్ధరాత్రం గాలుల సవ్వడిలా' ప్రతిధ్వనిస్తుంది. 'కవితకు ఆలోచనా, అనుభూతీ రెండు కళ్ళు'సుమంచే మనకు కలిగిన గాఢానుభూతియే ఒక స్మృతిగా, చెరగని ఓ ముద్రగా మనస్సులో నిలిచిపోతుంది. అవకాశం కలిగినప్పుడు అదే ఒకరూపాన్ని చిత్రించుకుంటుంది. ఇది ప్రతి జీవికీ సామాన్య లక్షణం.

అలాగే పరమాత్మలో లీనమయిన జీవాత్మ తన వ్యక్తిత్వాన్ని తెలుసుకొని, అటు పరమాత్మలోనూ, ఇటు ఇతర జీవాత్మలలో

నూతన ఏకత్వాన్ని అనుభవిస్తున్నది. అందులోనే భిన్నత్వంలో తన వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటోంది.

ఇదే కవి గీచిన భావ చిత్రంలో చూడండి.

'భౌతిక రూపంలో వలయాలుగా
వికాస దశ పొందిన ఆత్మరూపం
పొందుతూంది స్మృతుల కదలికకు |
నవవర రసోత్పుల సృష్టి'.

చివరి వాక్యం ఏకం అనేకంగా అభివ్యక్తమవడాన్ని తెలుపుతుంది. తర వాత కవి 'మలచుకొని మెట్లు మెట్లుగా అవతరిస్తున్నాయి మబ్బులు క్రిందినుండి పైకి పరంపరగా' అని అంటాడు. ఇవి సత్యలోకం నుంచి పైకి పోవటాన్ని, 'The sevenform chord of Being'లో చెప్పిన Matter, life, psyche, Mind -అనే ascent క్రమాన్నీ సూచిస్తున్నాయి. ఆ తరవాతదేకదా అలిత మనస్సు. ఇక్కడ ఒక విధ మైన ప్రశాంతత ఏర్పడుతుంది మనస్సుకు. ఇదే 'గాలి వినయంగా ప్రక్కలకు ఒత్తిగిలిపోతోంది'—అనడంలో ధ్వనింపజేస్తాడు కవి.

ఈ స్థితిలో కవి ముఖంతో ఉదయంగూడుకటు కుంది. విర బూచిన తీగెల వరుసలుగా కళ్ళలో వెలుగులు ప్రసరిస్తున్నాయి. చైత్యభూమికను సాధించిన ఈ స్థితిలో భవిష్యత్తు తన అస్పష తను విడిచింది. జీవితం మృత్యురహస్యాన్ని తెలుసుకున్నది. మనసు ఉత్తేజంతో వెలుగుగా నాట్యం చేసింది. అగరుధూపంలా ఊహ కద లాడింది జీవితం ధన్యమయినటు కనవచ్చింది.'

అదే అంటాడు కవి చివరలో

'భగవంతుని రాగ కరస్పర్శతో
మహితమైనట్లుంది జీవితం
లేదు ఇక్కడ ఎక్కడా చీకటి
ఏ ఒక్క బిందువులోనూ.'

అని రంగారావు గారికి కలిగిన ఈ భావగతులను చదివితే అరవిందుని తత్త్వాన్ని ఆయన వింతగా వంటపటించుకున్నారో అర్థమవు తుంది. అంతేకాదు, కావిరెడి చెప్పినట్లు ఆయనొక మహాకవిగానే కాక ఒక గొప్పతత్త్వవేత్తగా మనముందు నిలుస్తారు. [No man was ever yet a great poet, without being at the same time a profound philosopher.']

ఈ ఘట్టము ఒకే భాగముగా తీర్చిదిద్దబడింది. సప్త వ్యాహృతులలో సత్యమునకు అనగా సత్యలోకమునకు సంబంధించిన విభాగమేఇది. 'అటు మనస్సుకూ ఇటు ఆత్మకూ మధ్యస్థితిని' తెలిపేది.

అతిమానస చేతనయొక్క మూడోదశలో 'జీవాత్మ పరమాత్మ తోనూ, ఇతర జీవాత్మలలోనూగల సంబంధాలకు మాత్రమే ఎక్కువ ప్రాముఖ్యాన్నియిస్తూ, వాటినే తన అనుభవ క్షేత్ర పరిధిగావించు కొంటుంది. కాబట్టి జీవాత్మపరమాత్మలమధ్య దివ్యానందాన్ని కలిగించే ఒక విధమైన ద్వైతస్థితి ఇచ్చట దానికి కావలసిన సకల పరిణామాలలోనూ ఏర్పడుతున్నది.' కాని 'జీవాత్మ తాను పరమాత్మ వలెనే ఏర్పడితిననీ, ఆ పరమాత్మ శక్తిమూలంగానే రూపొందితిననీ తెలుసుకొనియే ఉండును. తానా జగన్నాటక సూత్రధారియొక్క అంశమనియే తలంచును. కావున సర్వవిధములా స్వాతంత్ర్యాన్ని పొందినట్లు భావించదు. సకలమునకు ఆధారమైన ఏకత్వమెంత సత్యమో, నానాత్వముకూడ అంతే సత్యము. ఒకటి ఉత్తర ధ్రువము కాగా రెండవది దక్షిణ ధ్రువము. 'మొదటిది ఆలీలకు మూలస్థానము; రెండవది దాని తుది పరిణామం' కావున 'సంపూర్ణానందాన్ని పొంద డానికి జీవాత్మ పరమాత్మలు వేరువేరుగానే ఉండి, అవి రెండూ ఐక్యమొందుటే విశేషము.'

ఈ విషయాలను తెలియపరచునదే 'ఆనందధుని' లో మూడవదీ, చివరిదీఅగు 'ఆదిత్యవలయం'. ఇది ఆత్మకు ప్రతీక. ఇది 'సూర్యగోళహృదయంతోఉన్న చావులేని ప్రపంచం! ఈ ఘట్టా నికి చేరేసరికి ఎంత కాలంనుంచో 'ఉన్మఖీకృతమైన కవి మనస్సు వాగతీతమైన విభూతి'ని పొందింది' 'తెర తొలగిన వర్ణచిత్రంలా' జీవితం ప్రకాశించింది. లౌకిక భావం కరిగిపోయి లౌకిక రూపం మాత్రంమిగిలింది. ఆలోచన సముద్రంపై వీచే గాలికెరటంలాగా విడతెగకుండా కదలాడసాగింది. 'జీవ, నిర్జీవపదార్థాలలో ఉండే శక్తి రూపం అణువణువునా, సముద్రంలోని ప్రతి నీటి బిందువులోనూ ఉన్న సము దంలా ఒదిగిపోయింది.' చీకటిని విడిచిన ఉదయంలాగా ఊహ చావును వదిలేసింది.

అందుకే ఈ సమయంలో తన హృదయం

'వెలుగు కళ్ళనుండి
రాలుతూ నవ్వు పూలు
విచ్చినగగనం వదనంవలె ఉంది'

అంటాడు కవి. పరమాత్మతత్త్వం సూర్యునిలా ప్రకాశిస్తున్నది.

అది స్వయం ప్రకాశశక్తిగలది. దానినుంచి వెలుగును పొందిందే జీవాత్మ. ఇది ఆపరమాత్మలో ఐక్యమొందటమే ముక్తి. బ్రహ్మానంద సదృశమైన అద్వైతస్థితిని అనుభవించటమే ఇక్కడ జీవిపొందిన ఆనందము. ఇది 'మట్టిలో ఆడుకునే పిల్లడికి వీధిలో దొరికిన ఆట వస్తువు'తో సమానమంటాడు కవి.

ఈ ప్రకాశాన్విత (Illumined mind) స్థితిలో 'నిన్నటి దాకా మిణుగురుల్లా మెరిసిన కళ్ళు సూర్యచంద్రబింబాల్లా' అయి నాయి. నిర్గుణ పరబ్రహ్మోపాసనాస్థితికి రావడంతో ఇక్కడ అన్ని 'భగవంతుని ఆలోచనలే'! కనబడేవన్నీ 'ఆయనముఖాలే!' అందుకే కవికిక్కడ హరిహరాద్వైత తత్త్వం గోచరించింది.

అదే చూడండి ఆయన గీచిన భావచిత్రంలో

'వైకుంఠమూ కైలాసమూ రెండూ
రెండు భుజాలపై నిలచినట్లుంది
ఆవహించింది చైతన్యం, గాంగఝరీ సదృశంగా
ఆకాశాన్ని వంచి, భూమిని అణచి
నిల్చిన శక్తికి సంకేతంగా!

ఈ స్థితిలోనే 'భూతభవిష్యత్తులు వర్తమాన శిఖరానికున్న రెండు ముఖాలు'గా కనబడినాయి కవికి.

ఈ ఆనంద తన్మయత్వాన్ని కవి మాటల్లోనే చూడండి.

'తెరచుకొంది ఈ క్షణం
హిరణ్మయోజ్జ్వల కవాటం!
ఓంకారనాద సుందరంగా
హృదయ స్పందన లయతో'.

ఇందులో 'భావనకు కాంతినిస్తూ, అనుభూతికి ఒక ఆకారాన్నీ, గతినీ ప్రసాదించే హిరణ్మయకవాటం, ఓంకారం అనే రెండూ పూర్వాపర్వ క్రతులను కదలించేవి. 'ఈ క్షణం' అనేది 'నవనవోన్మేషిత మైన కాలం'. 'హృదయ స్పందనం'–జీవశక్తికి తార్కాణం. 'లయ'– నియతినీ, గతినీ సూచిస్తుంది.' ఇది తపోలోకాన్నిచేరిన దశ. సచ్చిదా నందములలో చిత్తుయొక్క దశ. ఇది స్వతః స్ఫురణ మనస్సు [Ittuitive mind]

దాని తరవాతదే జనులోకము ఇదే ఉపరిమనస్సు [cover mind] ఇక్కడికి చేసేసరికి మనస్సుకు బ్రహ్మానందాన్ని పొందబోయే స్థితి కలుగుతుంది. ఇది 'తొలకరివానకు ముందుగా వీచే చల్లని గాలికి తలెత్తి ఒళ్ళుమరచి ఊగేవనం' వలె ఉందని ఉపమిస్తాడు కవి. దాంతో ఎడారిలాఉన్న విషయం పటుమాయమయింది. 'మనస్సు తుపాను వెలిసిన ఆకాశంవలె ప్రశాంతంగా ఉంది. ఇదే స్థితిలో 'సూక్ష్మరూపంతో సృష్టి రహస్యం' అవగతమయింది. 'ఆ మహా శక్తి ప్రకృతినుంచి మనస్సునుదాటి ఆత్మసీమల్ని తాకింది'. దాంతో జీవాత్మ ప్రకాశించింది మళ్ళీ. అంటే 'పునస్సంజీవితమయిందన్న మాట.

'పదార్థమనేదే ఒక విధమైన ముసుగు కప్పుకున్న ప్రాణం. అందుకే పదార్థంలో ప్రాణం, ప్రాణంలో మనస్సూ ఉన్నాయి. కాబట్టి మానవుని మనస్సు అనుక్షణమూ భగవంతునివైపూ, సచ్చిదానందంవైపూ, అమృతత్వంవైపూ పరుగులుతీస్తూ ఉంటుంది; ఎప్పటికప్పుడు ఎన్నో పరిణామాలను పొందుతూ ఉంటుంది.' అందుకే సృష్టి ప్రథమ రూపవాసనా బీజంనుండి బ్రతుకులోని శిఖర భూత సంస్కారవృక్షంవరకూ ప్రకృతిలోని రూపవికాసమే ప్రాణిలోని జీవ స్పందన'మంటాడు కవి. ఈ విషయాన్నే గోపీచంద్ మాటలలో చూడండి.

అరవిందులు 'పరిణామవాదాన్ని నమ్మరారు. చలనంలేని పదార్థంనుంచి ప్రాణం వచ్చిందనీ, ప్రాణంనుంచి తన్నుతాను తెలుసు కునే జ్ఞానం వచ్చిందనీ–ఈ జ్ఞానం మానవునిలో పరిపూర్ణత పొందటానికి ప్రయత్నిస్తూ ఉందనీ చెపుతారు. పరిణామం ఇంత టితో ఆగదు పరిణామంలోకి ఇంకోదశ రాబోతుందనీ అదే అతీత మానసిక శక్తి అని చెపుతారు. ఏదీ శూన్యంనుంచి రాదు. కనుక ఈ పరిణామంలో ఒక అంతస్తు కారణంగా, ఒక అంతస్తు వస్తూ ఉంది అంటారు. ఇంతకుముందు పరిణామం తెలియకుండా జరిగిం దనీ, ఇక మానవునికి తన్ను తాను తెలుసుకునే జ్ఞానం ముందుకు చూడగలిగిన శక్తి వచ్చినది గనుక, మనకు తెలిసిన పరిణామం పొంద గలమనీ, ఇందువల్ల ఆనందం, కాలం కలసిరావటం జరుగుతుందని చెపుతున్నారు'. (పోసు చెయ్యని ఉత్తరాలు–గోపీచంద్.)

అతి మానస దివ్య చైతన్యంలోని మూడు దశలూ ఒకే దివ్య సత్యంలోని మూడు పద్ధతులు అనుభవించే సత్యం ఒకటే

అనుభవించడంలో పొందే ఆత్మచైతన్యస్థితులు వేరు. ఇవన్నీ అతి 'మానసంయొక్క పరిధిలోవే! అతిమానస ప్రథమ దశలో ఉన్న దివ్యైకత్వాన్నే రెండూ, మూడూదశలో దివ్యానేకత్వ వైభవాన్ని పొందటం జరుగుతోంది' పరిణామంలో నూతన దశ వచ్చినపుడల్లా దిగువదశలను ఆ దశకు అనుకూలంగా మార్చుకోవాలని శ్రీ అరవిందులు చెపుతారు. నూతనంగావచ్చినదశ, దిగువదశలను తన నియమాల కనుగుణంగా మార్చుకుంటుంది...ఇప్పుడు ఈ అతీతమానసిక శక్తివల్ల వచ్చిన దృక్పథంతో మనస్సునీ, ప్రాణాన్ని, శరీరాన్ని మార్చుకోవలసిఉంటుంది. అప్పుడు మానవుడు విరుద్ధశక్తుల కలయికకాక ఒకే ప్రవాహాన్ని ప్రతిబింబించే వాడుగా ఉంటాడు. అందువల్ల అతనే పరిణామం అవుతాడు.' (గోపీచంద్).

కవినే శ్రీ కమలాకర వేంకటరావుగారు 'విద్యాక్షేత్రంలోని అతిమానస దివ్య చేతన అవిద్యా క్షేత్రములోని కవతరించి అవర ప్రకృతిని రూపాంతరము చెందించుట ద్వారా మనః ప్రాణ దేహముల యందే దివ్యలీలను ప్రతిష్ఠింపవలసియున్నది. అతి మానసచేతన యందు లక్షితమైన బహుత్వలీలా వైభవమునకు చరమసాఫల్యసిద్ధి అప్పటికిగాని కలుగదు' అని అంటారు.

ఈ స్థితిని సంపూర్ణంగా అనుభవించిన శ్రీ మాదిరాజు వారు 'నేనీ క్షణం అనేక వాసంత సూర్యోదయ కల్యాణ కాంతికి సంకేత స్థానం, నేనీక్షణం అనేక రసప్రవాహాల ఆనందనృత్యానికి అవనీచక్రం' అంటూ కవితను ముగించి ధన్యు లవుతారు.

(దీనిని వ్రాయుటకు (1) మహాయోగి అరవిందుడు – శ్రీ కాకుమాను తారానాథ్ - భారతి – మార్చి, ఏప్రిల్ 1972. (2) అరవిందుని సావిత్రి – శ్రీ కామఋషి సత్యనారాయణశర్మ– భారతి – మే 1972. (3) శ్రీ అరవింద విరచిత సావిత్రి – ఒక గాథ-ఒక ప్రతీక–శ్రీ వి. వి. యస్. రామదాసు–భారతి–జూన్ 1972 (4) శ్రీ అరవింద దర్శనంలోని అతి మానస తత్త్వమీక్ష – శ్రీ కమలాకర వేంకటరావు భారతి ఆగస్టు 1972– వ్యాసాలు తోడ్పడినాయి. రచయితలకు ధన్యవాదాలు.



# కలగూరగంప

## సాయణ-మాధవ-విద్యారణ్యులు-వేదభాష్య రచనాదులు

హంపీ విద్యా నగర స్థాపకులు సాయణ మాధవ విద్యారణ్యులని పర్యజన వేద్యము. కానీ మాధవ రూపమున నుండు తఱిని విద్యా నగర స్థాపన మొనర్చిరా ? లేక విద్యారణ్య రూపమున నుండు తఱిని విద్యా నగర స్థాపనమైనదా ? యను సందియము సర్వత్ర నుండనే యున్నది. చరిత్రకారులు విద్యారణ్యులు విద్యానగర స్థాపనాచార్యులనిరి. కొందఱు మాధవ విద్యారణ్యులు స్థాపనాచార్యులనిరి. మాధవులు నెంతవరకుండిరి. అనక విద్యారణ్యులుగ నెప్పుడైరి? యను విర్ణయము కానరాకున్నది.

విద్యారణ్యులు విద్యానగర స్థాపకులనుటకు నొక గాథ వచింతురు. మాధవులు మహాలక్ష్మిని గూర్చి తపస్సుజేసినట్లు, మహాలక్ష్మి ప్రత్యక్షమైనట్లు, ఈ జన్మలో సంపద నివ్వను. పై జన్మలో నిస్తానని లక్ష్మి యాదేశమును పురస్కరించుకొని, దారిద్ర్య బాధకు నోర్వలేక సన్యసించినట్లు, సన్యాసము తీసికొనిన మాధవులు విద్యారణ్యులైనట్లు, ఆ విద్యారణ్యులవారికి లక్ష్మి సాక్షాత్కరించినట్లు, తనకు వలదని విద్యారణ్యులనినట్లు, ఆ లక్ష్మి యనుగ్రహం వ్యర్థంగాదు గనుక కనకవృష్టి గురిపించినట్లు—ఆ ధనముతో విద్యానగర స్థాపనమైనట్లు వచింతురు. ఈ గాథకు ఆధారా లెవ్వియు లేవు. ఉన్నట్లు యెవరు వ్రాసినట్లు లేదు.

వేద భాష్య భూమికలు పరిశీలింతుమేని, బుక్కరాయలు రాజ్యము చేయు తఱిని, ఋగ్వేద యజుర్వేద భాష్యములు వ్రాయువరకు మాధవుల పేరుతో రచనములు గలవు. సామవేద భాష్యరచనా కాలానికి మాధవుల పేరుగాని, విద్యారణ్యుల పేరుగాని లేదు. సాయణాచార్యుల పేరు మాత్రమున్నది, అధర్వణ వేద భాష్య రచనాకాలానికి, బుక్కరాయలు లేరు. ఇతని పుత్రుడు రెండవ హరిహరరాయలు రాజ్యపాలకుడై యుండి, సాయణాచార్యులను అధర్వణ వేద భాష్య రచనము చేయమని కోరినట్లున్నది. ఈ యధర్వణ వేద భాష్య రచనమున, సాయణాచార్యులు, విద్యారణ్య ప్రసక్తిని తెచ్చిరి.

అనగా, హంపీ విద్యానగర స్థాపన కాలానికి మాధవులుగ నుండిరి. మొదటి హరిహరులు, అనంతరము వీర బుక్క మహీపతి రాజ్య కాలముననూ, మాధవులుగనే యుండినట్లున్నది. యజుర్వేద భాష్యము బుక్కరాయల కోరికపై, సోదరుడైన సాయణాచార్యునితో రచింపజేయించినట్లు తాను పరిశోధకుడుగ నున్నట్లున్నది. ఋగ్వేద భాష్యమును మాధవులే స్వయముగ రచించినట్లున్నది. శుక్ల యజుర్వేదీయకణ్వశాఖ భాష్యము, సామవేద భాష్యము రచించు కాలానికి మాధవులు మారినట్లున్నది. పై రెండు భాష్యములను, సాయణాచార్యులనే వ్రాయమని బుక్కరాజు కోరినట్లున్నది.

అధర్వణ వేద భాష్య రచనా కాలానికి బుక్కరాయలు లేరు. పుత్రుడు రెండవ హరిహరులు రాజై యుండి సాయణులను అధర్వవేద భాష్యమును వ్రాయమని కోరినట్లు గలదు. అందు సాయణులు విద్యారణ్యులను ప్రశంసించిరి. దీనిచే తేలిన సారాంశమేమనగా, మాధవులు విద్యానగర స్థాపకులు, హరిహరరాయలు బుక్కరాయల పాలన వరకు గూడ, మాధవ మంత్రిగనే వ్యవహరించిరి. బుక్కరాయల ప్రేరణచే, అపౌరుషేయమైన వేదమునకు భాష్య రూపమున, అర్థ వివరణము చేసిరి. ఆ నాటికి గూడ మాధవులే గాని, విద్యారణ్యులు కాలేదు. బుక్కరాయల పాలన చివరి రోజులలో మాధవులు సన్యసించి విద్యారణ్యులుగ మారిరని తోచుచున్నది. ఆ విషయాలను గూర్చి సవివరంగా నిందు పొందుబరతును. సహృదయులు పరికించి, విశేషించిన చారిత్రకాంశాలను వెల్లడించదగునని మనవి.

హంపీ ప్రాంతము పురాణ ప్రసిద్ధ స్థలము. స్కాంద పురాణమున, విరూపాక్ష మహిమను గూర్చు అధ్యాయములు మెండుగ గలవు. రామాయణమున పంపా సరోవర ప్రాంత వర్ణన గలదు. ఆ పంపా సరోవర ప్రాంతమునకే హంపియని యందురు. ఈ హంపీ ప్రాంతమున విద్యానగర నిర్మాణము చేసిన వారే మాధవులు (అనంతరం విద్యారణ్యులైన వారు) ఈ మాధవ విద్యారణ్యుల చరిత్రను తొలుత సంక్షేపంగా వ్రాసినవారు డా. "బర్నెల్" దొరగారు. సామవేద వంశ బ్రాహ్మణ పీఠికను బర్నెల్ వ్రాయుచున్న చరిత్రను సంక్షేపించి వ్రాసిరి.

మాధవ విద్యారణ్యుల ఖడ్గశక్తి, కార్యశక్తి అపారము. 14వ

శతారంభ కాలము, హిందువులకు శోచనీయమైన దుష్కాలము. దక్షిణాపథమున రెండు మతవాహినులు పోరు సలి దేవగిరి యాదవ రాజ్యాన్ని, హిందువులు వదలుకొనిరి కాకతీయుల ఓరుగల్లు పతన మాయెను. దక్షిణా పథమున, ఢిల్లీ పాదుషాల ధాటికి యెదురు నిలుచువారు లేరు. ఇట్టి తఱిని మాధవులు హంపీ విద్యానగర రాజ్య స్థాపనము చేసిరి. తొలి పాలకుడు హరిహరరాయలు, ఇతను సుమారు ఏడు వత్సరములు పాలకుడుగ నుండెను. అనగా క్రీ. శ. 1336లో విద్యానగర నిర్మాణ మొనర్చి హరిహరరాయలు పాలకుడై, 1341 వరకు నుండెను. అది మొదలు 1379 వరకు వీరబుక్కరాయల రాజ్యపాలనకాలము. నలువదినాల్గు వత్సరాలకాలము (1336–79) వరకు, మాధవాచార్యుల పేరుతోనే గ్రంథాలున్నవి.

ఈమధ్య కాలమున అనగా బుక్కరాయలు రాజ్యపాలకుడై, దేశాన్ని ధర్మవంతంగా పాలించుచుండు కాలమున మాధవులను వేద భాష్యము రచింపుడని కోరెను. ఆ నిర్ణయమునే మాధవులు సాయ ణులు, యజుర్వేదభాష్యారంభమున నీరీతి నుగ్గడించియున్నారు.

తొలుత గణపతి ప్రార్థన మొనర్చుచు—
"వాగీశాద్యాస్సుమనసః సర్వార్థానాముపక్రమే !

యంనత్వా కృతకృత్యాః స్యుస్తం నమామి గజాననమ్" అని గణపతి ప్రార్థనతో వేదభాష్యరచనకు పూనుకొనిరి.

"యస్యనిఃశ్వసితం వేదా యో వేదేభ్యో ఽఖిలంజగత్ !
నిర్మమే, తమహంవందే, విద్యాతీర మహేశ్వరమ్"
అని గురువర్యులైన విద్యాతీర్థులను స్తుతించిరి.

"యత్కటాక్షేణ తద్రూపం దధత్ బుక్క మహీపతిః
ఆదిశన్మాధవాచార్యం వేదార్థస్యప్రకాశనే"

బుక్కమహీపతి, వేదార్థము యొక్క ప్రకాశనార్థమై మాధవా చార్యున కాదేశ [illegible]సంగెను. అనగా వేదమునకు అర్థము వ్రాయ మని మాధవాచార్యుని బుక్కరాజు కోరెను.

దీనివల్ల తేలినదేమనగా, మాధవులు యజుర్వేద భాష్య రచనా కాలానికి, ఆశ్రమము తీసికొనలేదు, విద్యారణ్యులు కాలేదని, తేట తెల్లమగుచున్నది. హరిహరుల యనంతరం బుక్కరాజు. రాజు ఇంత వరకు, మాధవులుగ నుండే విద్యారణ్యులైనట్లు, లక్ష్మీ యను గ్రహాన్ని వద నినట్లు, విధిగలక్ష్మి కనకవృష్టి గురిపించగ, రాజ్య నిర్మా ణానికి విద్యారణ్యులు ఆదేశమిచ్చినటు చరిత్రకారులనడము ఎట్లు పొసగును ?

"స ప్రాహ నృపతిం రాజన్ ! సాయణార్యో మమానుజః
సర్వం వేత్త్యేష వేదానాం, వ్యాఖ్యాతృత్వే నియుజ్యతామ్"
అని మాధవులు, తన సోదరుడైన సాయణాచార్యులవారు గలరనియు. సమస్తము నెరిగినవారనియు, వేదములకు వ్యాఖ్యానములు వ్రాయు టకై యతనిని నియోగింపదగినదియు వీరబుక్కరాయలకు తెలిపెను.

"ఇత్యుక్తో మాధవార్యేణ వీరబుక్క మహీపతిః
అన్వశాత్ సాయణాచార్యం వేదార్థస్య ప్రకాశనే"

అను తైత్తిరీయ సంహితా భూమికలోని ప్రమాణవచనానుసారము సాయణాచార్యులను మాధవులు యజుర్వేదభాష్య వివరణమునకు చెప్పిన ట్లున్నది గాన బుక్కరాయల పాలనలో గూడ, మాధవులుగనే నున్నారు గాన విద్యారణ్యులుగ సన్యసించలేదనే తెలియుచున్నది.

ఈ రీతిని సాయణులు యజుర్వేద భాష్యము వ్రాయు తఱిని మాధవులు రాజకార్య నిర్వహణాదులతో గూడా, శాస్త్ర గ్రంథాలకు వ్యాఖ్యానము వ్రాయుచుండినట్లున్నది. ఎందుకనగా — భాష్యమున నీ విషయము సూచింపబడి యున్నది. పరికించుడు. యజుర్వేద భాష్యానంతరము ఋగ్వేద భాష్యము వ్రాసినారని వారే స్వయముగ వచించినారు.

యే పూర్వోత్తరమీమాంసే తే వ్యాఖ్యాయాతిసంగ్రహాత్
కృపాళుః మాధవాచార్యః వేదార్థం వక్తుముద్యతః

అనుటచే వేదభాష్య రచనానికి మునుపే, మీమాంసశాస్త్రానికి వేదాంత శాస్త్రానికి (ఉత్తర మీమాంసకు) వ్యాఖ్యానాదులు కృపాళువైన మాధవులు రచించినట్లు సాయణ వచనము నిరూపించుచున్నది.

ఈ ప్రకారము ఋగ్వేదభాష్య భూమికను పరికింతముగాక. యజుర్వేద భాష్యములో వలెనే తొలుత గణపతి ప్రార్థన
"వాగీశాద్యా స్సుమనసః సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకృత్యాఃస్యుః తం నమామి గజాననమ్" అని ప్రార్థించిన యనంతరము గురువర్యులైన విద్యాతీర్థులను "నిర్మమే త మహం వందే విద్యాతీర్థ మహేశ్వరమ్" అని గురువందనము చేసిరి. అనంతరము

"యత్కటాక్షేణ తద్రూపం దధత్ బుక్కమహీపతిః
ఆదిశన్మాధవాచార్యం, వేదార్థస్య ప్రకాశనే"

అని ఋగ్వేదభాష్య రచనకు గూడా, బుక్కభూపతి, మాధవాచార్యులనే ఆదేశంచిరి. ఎందుకనగా

"యే పూర్వోత్తరమీమాంసే తే వ్యాఖ్యాయాతిసంగ్రహాత్
కృపాలుః మాధవాచార్యః వేదార్థం వక్తుముద్యతః ॥

అధ్యర్యవస్య యజ్ఞేషు, ప్రాధాన్యాత్ వ్యాకృతః పురా,
యజుర్వేదః, అథ హౌత్రార్థం ఋగ్వేదో వ్యాకరిష్యతే ॥

అను ఋగ్వేదభాష్య ఉపక్రమణికాదిలో నుండు వచనముల బట్టి, కృపాళుడైన మాధవులే, ఋగ్వేదభాష్య రచనకు పూనుకొని నట్టున్నది. ఇందు సాయణశక్తి లేదు గాన, మాధవరచనయే ఋగ్వేద భాష్యమున దగియున్నది. ఇందులోను విద్యారణ్యనామములేదు.

ఈ రీతిని సామవేద భాష్యరచన చేయు కాలానికి బుక్కరాజు—పై రెండువేదములు భాష్యమునకు నెల్లైతే మాధవులను ప్రోత్సహించెనో, ఆ ప్రోత్సాహమందులేదు. ఇందులో మాధవుల పేరేలేదు. మొదటి రెండువేద భాష్యములలోవలెనే "వాగీశాద్యాః" అను గణపతి ప్రార్థన, "యస్య నిశ్వసితం వేదాః యోవేదేభ్యోఖిలంజగత్ ! నిర్మమే తమహం వందే విద్యాతీర్థం, మహేశ్వరం" అను గురు ప్రార్థన, యనంతరం, "తత్కటాక్షేణ తత్వాదం దధత్ బుక్క మహీపతిః!

ఆదిశత్ సాయణాచార్యం, వేదార్థస్యప్రకాశనే,

కృపాళుః సాయణాచార్యం, వేదార్థం వక్తుముద్యతః ! అని యుండుటచేతను, తొలుత భాష్యము అయిన, యజుర్వేద ఋగ్వేద భాష్య ప్రారంభములలో బుక్కభూపతి. మాధవులను ఆదేశించి యుండగ, నీ సామవేద భాష్యరచనా కాలానికి మాధవులను నీడి నేరుగా సాయణులనే ఆదేశించుటచేత, మాధవులు యీ సామవేద భాష్య రచనా కాలానికి, రాజకార్యములనులచి విరమించిరేమో ? సన్యాసము స్వీకరించు ప్రయత్నములలో నుండిరేమో ? లేదా, యితర కారణాలచే నేమేని బుక్కరాజుకడ లేక వైదొలగియుండి యుండడము తటస్థించి యుండనోపు : లేకున్నచో, "ఆదిశన్మాధవాచార్యం" అని యుండదగినచోట, ఆదిశత్ సాయణాచార్యం" అని సామవేదరచనలో నీ మార్పునకు కారణమేమైయుండునో ? పరిశీలకులు పరిశీలించి తెల విన్వదగియున్నది. అనగా, యజుర్వేద, ఋగ్వేదభాష్య రచనలకు బుక్కమహీపతి కృపాళుడైన మాధవులను ఆదేశించెను. సామవేద భాష్య కాలానికి మాధవులను వదలి నేరుగ సాయణులనే భాష్యరచనకు ప్రోత్సహించినట్లు తెలియుచున్నది గదా !

యజుర్వేదములో నొక భాగ మనదగు శుక్ల యజుర్వేదము లోని కాణ్వశాఖా సంహితా భాష్యమునకు గూడ, సాయణాచార్యులనే బుక్కరాజు ఆదేశించెను. సామవేద భాష్యానంతరము, ఈ శుక్ల యజుర్వేద భాష్య రచనము చేసినట్లు చెప్పకొని యున్నారు. ఇందులో గూడ, "ఆదిశత్ సాయణాచార్యం, వేదార్థస్య ప్రకాశనే" అనియే యీ కాణ్వభాష్య భూమికలోను గలదు. ఇందు మాధవుల ప్రశంసయే లేదు. విద్యారణ్యుల పేరు లేదు. !

ఇంతవరకు జరిగిన, యజుర్వేద తైత్తిరీయ సంహితాభాష్య రచనా కాలానికి మాధవులను వాయమని బుక్కరాజు కోరగ, సాయణాచార్యులను రచనకై మాధవులు నియమించిరనియు, ఋగ్వేద భాష్యమును మాధవులే స్వయముగ రచనచేసిరనియు, సామవేద, కాణ్వశాఖా భాష్యాల రచనా కాలానికి మాధవులు రాజకార్య విముఖులైరేమో గాన వారి ప్రశంస యందు లేకపోయినదని మనవి జేతును.

అనంతరము అథర్వణవేద భాష్య రచనము సాగినది. ఈ యథర్వణవేద భాష్యరచనా కాలానికి మాధవులుగాని, బుక్కరాజుగాని లేరు. బుక్కరాజు పుత్రుడైన 'రెండవ హరిహరరాజు' రాజ్యపాలకుడై యుండ, సాయణాచార్యులను అథర్వణవేద భాష్యరచనము చేయుమని కోరిరి. రెండవ హరిహరరాజు రాజ్యపాలకుడు గాన బుక్కరాజు గతించెనని యూహింపదగి యున్నది. ఇందు, విద్యారణ్య స్తుతి సాయణులు జేసి యున్నారు. కాన, అథర్వణవేద భాష్యకాలానికి మాధవులు సన్యసించి విద్యారణ్యులు అయిరి యని యూహింపదగియున్నది. ఆ విషయాలు అథర్వణవేద భాష్య భూమిక వలన స్పష్టమగుచున్నది, పరిశీలింతురుగాక. అన్ని వేద భాష్యములలోవలెనే తొలుత గణపతి ప్రార్థన "వాగీశాద్యాస్సుమనసః సర్వార్థానా ముపక్రమే, యం నత్వా కృతకృత్యా సుః తం నమామి గజాననమ్" అని గలదు. అనంతరము గురువర్యులైన విద్యాతీర్థుల ప్రార్థనము "యస్య నిశ్వసితం వేదాః యో వేదేభ్యో ఖిలం జగత్, నిర్మమే త మహం వందే, విద్యాతీర్థ మహేశ్వరమ్ ॥' అని విద్యాతీర్థ గురువర్యుల వందనము గలదు. అనంతరము విద్యారణ్యుల ప్రార్థన మీరీతినిగలదు.

"అవిద్యా భాను సంతప్తః విద్యారణ్య మహం భజే,
యదర్క కరతప్తానామ్, అరణ్యం ప్రీతికారణమ్"

సూర్య తాపమునకు తాళలేనివారు, చల్లదనముకై నీడపట్టు నాశింతురు ఈ నీడపట్టు అరణ్యమున మెండు. కాన అర్కకిరణ బాధా నివారణానికి అరణ్యములు ప్రీతి కారణములు అగుచున్నవి. ఆ

రీతిని అజ్ఞానభాను సంతప్తులకు ప్రీతిని కలిగించు విద్యారణ్యులను భజించుచున్నానని, సాయణులు విద్యారణ్యస్తోత్రమీ యధర్వణభాష్య రచనాకాలమున చేయుటచేత మాధవులు బుక్కరాజు రాజ్యపాలనలోని చివరి రోజుల వరకు ఉండినట్లున్నూ, అనంతరము సన్న్యసించి విద్యారణ్యులైనట్లున్నూ ద్యోతక మగుచున్నది.

"తత్కటాక్షేణ తద్రూపం దధతో బుక్కభూపతేః
అభూత్ హరిహరోరాజా, క్షీరాబ్ధే రివ చంద్రమాః"

అని, బుక్కభూపతిపుత్రుడు హరిహరుని ప్రశంస గలదు.

"విజయీ హరిహరభూపః సముద్వహన్, సకల భూభారమ్"
అని హరిహరుడు (రెండవ హరిహరుడు) సమస్త భూభారాన్ని వహించి అనగా పాలించుచుండినట్లు చెప్పబడినది. ఈ తటిని, సాయణులవారిని పిలిచి యిట్లనెను.

"తన్మూలభూత మాలోచ్య, వేదమాధర్వణాభిధం,
ఆదిశత్ శాయణాచార్యం, తదర్థస్య ప్రకాశనే"

అనుటచేత, హరిహరుడు, లోకము ధర్మవంత మగుటకు గల, మూలభూతమైన దేది యని యాలోచించి, వేదమే ధర్మరూపము గన, వటి ధర్మభూతమైన వేదములోని అధర్వణ వేదమునకు భాష్యము రచించమని సాయణాచార్యులవారిని కోరినటు న్నది. అందుకు

"కృపాలుః సాయణాచార్యః వేదార్థం వక్తు ముద్యతః
వ్యాఖ్యాయ వేదత్రితయమ్, ఆముష్మికఫలప్రదం.
ఐహికాముష్మిక ఫలం, చతుర్థం వ్యాచికీర తి"

అని యింతకు పూర్వము యజుర్వేదము, అనంతరము ఋగ్వేదము పిదప సామవేదము అను వేదత్రయ భాష్యములను, ఆముష్మిక ఫల ప్రదములైన వానికి వ్యాఖ్యాన రచనము సాగినది గాని, ఐహిక, ఆముష్మిక ఫలప్రదమైన అధర్వణవేద భాష్య రచనకు సాయణ ఉపక్రమించిరి.

ఈ కారణములను పురస్కరించుకొని, సింహావలోకన న్యాయానుసారము, సమీక్షింతుమేని, విద్యానగర స్థాపకులు మాధవులు గాని, సన్న్యసించిన విద్యారణ్యులుగారని తోచెడిని. మాధవులు లక్ష్మీ సంబంధంగా, తపమొనరుట, లక్ష్మి ప్రత్యక్షమై, అవతలి జన్మలో సంపద యిస్తాననటము వట్టి కల్పితము. ఇదే నిజమైనచో, మాధవులు, విద్యారణ్యానామమున, వ్యవహరింతురుగాని, శాస్త్ర రచనలు, వేదభాష్య రచనలలో మాధవులపేరే గలదు గాని విద్యారణ్యుల పేరు లేదుగదా! అధర్వణవేదభాష్య రచనా కాలానికి మాధవులు విద్యారణ్యులైరి గదా!

మాధవులు తపస్సుజేసి యుండవచ్చు రాజ్యనిర్మాణముచేసిరి. మొదటి హరిహరులకు, బుక్కరాయలకు మంత్రిగను నెగడిరి. యజ్ఞముజేసిరి. మాధవ సోమయాజియైరి. మీమాంస శాస్త్రమున దీపిన జైమిని న్యాయమాలా రచనమున,
"ఇతి శ్రీమత్త్రికాండ మీమాంసామండన ప్రతివసంత సోమయాజి భట్ట శ్రీ మాధవ విరచితే జైమినీయ న్యాయమాలా విస్తరే"
అని యుండుటచేత, మాధవులు యజముచేసిన సోమయాజులని రూఢిగ తెలియుచున్నది.

ఈ జైమినీయ న్యాయమాలా గ్రంధముగూడా, వేదభాష్యాల కన్నా మునుపు, బుక్కరాయల ప్రేరణచేతనే వ్రాయుచున్నానన్నారు, చూడుడు.

"సమాధవః ఖలుప్రాజ్ఞజీవాతు : సర్వశాస్త్రి విశారదః
అకరోజ్జైమిని మతే, న్యాయ మాలాం గరీయసిం!
తాం పశంస్య సభామధ్యే వీర శ్రీబుక్క భూపతిః
కురువిస్తర మస్యాస్త్వమితి మాధవమాదిశత్!
నిర్మాయ మాధవాచార్యో విద్యదానంద దాయినీం!
జైమినీయ న్యాయమాలాం వ్యాచష్టే బాలబుద్ధయే!"
అను జైమినీయ న్యాయమాలా విస్తర గ్రంథమున గల ప్రమాణ వచనముల ననుసరించి పరికించినన్నూ, విద్యానగర స్థాపనాచార్యులు. మాధవులనియే తెలుసు. బుక్కరాజు రాజ్యకాలాన, పై గ్రంథ రచన మాధవులు వ్రాసిరి గనుక మాధవుల పేరుతోనేగలదు గాని విద్యారణ్యుల పేరు లేదుగదా! జైమినీయ న్యాయమాలను, మాధవ సోమయాజి రచించిరి. బుక్కరాయలు ప్రేరేపించిరిగదా! అట్టి బుక్కరాయలను మాధవ(సోమయాజి) మహామంత్రి యీ రీతిని ఆశీర్వదించిరి.

"వేదానాం స్థితికృత్ పురా, హరిహరో భూత్
సూత్రకృజ్జైమినిః! తద్భాష్యం శబరోభ్యధాద్దితవాం
స్తద్విస్తరం మాధవః! సోయం నిత్యకళత్ర పుత్రధన
భుగ్భూత్యాధిపత్యస్థితిః దీర్ఘాయుః సహబంధుభిః
విజయతామా చంద్రమాతారకమ్"

వేదములలో గల కర్మ ప్రవృత్తి విధి నిషేధాదులను గూర్చి, జైమినిమహర్షి సూత్రములలో వ్రాసెను. ఇవి, వ్యాసుని బ్రహ్మ సూత్రములు వేదాంతాని కెట్లగునో, ఆరీతిని, కర్మ మార్గానికి

జైమిని సూత్రములంత ముఖ్యము. ఈ గ్రంథమున 2745 అధికరణములపేర న్యాయ వివరణమున్నది. జైమిని మహర్షి యానాటి ఋషి వర్యులను సంప్రదించి చర్చించి తర్కించి నాలుగువేల [4వేలు] సూత్రములతో, నీ జైమిని సూత్రములను రచించెను. పదునారు అధ్యాయములున్నవి. ఈ సూత్రములకు, (వ్యాస సూత్రములకు శంకరులు భాష్యము రచించినట్లుగ,) శబరస్వామి యను మహనీయులు భాష్యము రచించెను. ఉపవర్షులు వృత్తిని రచించినవారు. కాని యవి సులభబోధకములు కానందున, మాధవులు (సోమయాజియైన పిదప) బుక్కరాయల యనుమతిపై, రెండువేల యనుష్టుప్ [2వేలు] శ్లోకములలో, నీ జైమిని మతానుసారము, భాట్టమతము రీతిని, "న్యాయమాలా విస్తరము" పేర రచించిరి. ఈ గ్రంథము, హరిహరరాయల కాలాన, బుక్కరాయల ప్రేరణచే జరిగినదిగాన, పై రీతిని, "వేదానాం స్థితికృత్" అను ఆశీర్వాదము, హరిహరునకు చేయవలసి వచ్చినది. నిత్యము కళత్ర పుత్రులతో, ధనము, భూపాలత్వముగలిగి, దీర్ఘాయువై బంధువులతో, చంద్ర సూర్యనక్షత్ర పర్యంతము, విజయాభూతులై యుందురుగాక యని యాశీర్వదించినది మాధవులుగాని, విద్యారణ్యులుగారే. కాన విద్యానగర స్థాపనకు, హరిహరునికడ మంత్రిత్వము, మీమాంసాశాస్త్రానికి వేదాంతశాస్త్రానికి వివరణములు, అనంతరము బుక్కరాయలకడమంత్రిత్వము, యజుర్వేద భాష్యానికి, సోదరుడైన సాయణాచార్య నియోగిత్వము, ఋగ్వేదభాష్య రచనము తానే స్వయముగ, రచించువరకు, గల కాలమువరకు, మాధవులుగనే యుండినట్లు రూఢియగుచున్నది గదా!

సామవేదభాష్య రచనము బుక్కరాయల ప్రేరణచే, సాయణులు రచించుకాలానికి మాధవులు రాజకార్య విముఖుడైనట్లున్నది. సన్యాస స్వీకరణ కలాపములలో నిమగ్నుడైయుండ నోపు. శుక్ల యజుర్వేద కాణ్వాశాఖ భాష్యము రచించు కాలానికి మాధవుల జాడ తెలియదు. అథర్వణవేద భాష్యరచనము కాలానికి బుక్కరాయలంతరించిరి. రెండవ హరిహరరాయలు రాజ్యపాలకుడు, భాష్యరచనము సాయణులు చేసిరి. ఇందు విద్యారణ్య స్తుతియుండుటచే, బుక్కరాయల యనంతరము మాధవులు సన్యసించిరి కాబోలు విద్యారణ్యులైనటులున్నది.

దీనినిబట్టి చూడ, "ఇదం బ్రాహ్మమ్, ఇదంక్షాత్రం" అను లోకోక్తిని పురస్కరించుకొని, పదమూడవశతాబ్ది చివరన, భారత దేశానికి గల్గిన, మతాంతరీకరణము, దేశభ్రష్టత్వము, స్వదేశరాజుల పతనము, ఢిల్లీపాదుషాల, దుర్మాకుమణములను. చూచి, సర్వజ్ఞులైనవర్యులు (అనగా మాధవ గురువర్యులైన విద్యాతీర్థులు) శ్రీ విజయమాధవులు, జాతికి, దేశానికి, సంఘానికి ధర్మానికి, గల్గినగానిపరికించి, అపరదైవ స్వరూపులో అనురీతిని అవతరించినవారై, దేశసంరక్షణార్థమై, జాతి నుద్ధరించు తలంపున, వేదశాస్త్ర సంస్కృతి సంప్రదాయ పరిరక్షణార్థము, తపస్సుజేసి, మహాలక్ష్మి యనుగ్రహము నడసి, ఆ సంపదనంతయు స్వార్థమునకు వినియోగించుకొనక, ధర్మార్థము వెచ్చించి, దేశాన్ని, జాతిని, సంఘాన్ని, ధర్మాన్ని కాపాడి హరిహర, బుక్కన్నల నామకార్థము నిలిపి, సర్వరక్షణ పాలనాధికారములు తానే నిర్వహించి, దక్షిణ భారతావనిని మరల తన పాలన క్రిందికి తీసికొనివచ్చి, విద్యానగర స్థాపనాచార్యుడను శాశ్వతకీర్తి పతాకను, చేబట్టి నది మాధవులే.

శాలివాహన శకము 1258కి తగిన క్రీ. శ. 1336లో గల ధాతు సంవత్సర, వైశాఖమాస, శుక్లపక్ష సప్తమీ బుధవారమున, బృహస్పతి లగ్నమునందుండు కాలమున, మాధవులు గురువుల ఆజ్ఞ మేరకు (విద్యాతీర్థుల ఆజ్ఞ మేరకు) 'శ్రీ విజయనగరం' అను పేరుతో నగర నిర్మాణము చేసిరట.

శ్రీ యనగా లక్ష్మి, విజయము చేసిన స్థలముగల నగరము అనగా లక్ష్మీదేవి ప్రత్యక్షమైన స్థానమనదగు నగరమని తన పరంగా అర్థము.

ప్రజల పరంగా, శ్రీ – సంపద, విజయముచేయు నగరము అనగా సంపదలతో గూడియుండు నగరము అని, ప్రజలకు తగిన యర్థము. రాజు పరంగా. శ్రీ సంపదయు, విజయము జయమును గలిగించు యోగ్యమైన నగరమనియు, శ్రీవిద్యా ఉపాసనకు నిలయమైన నగరమనియు పేర్కు చరితార్థము, అర్థవంతము, యుక్తియుక్తము అగు రీతిని 'శ్రీ విజయనగర'మను పేరు ఎంతో యోచనలో పెట్టినట్లున్నదని భావింతును.

"నాగేశ్వర్కే నియమితశకే శాలివాహస్య యాతే
ధాతర్యబ్దే సుగుణసహితే మాసి వైశాఖనామ్ని,
శుక్లే పక్షే సురగురుయుతే సౌమ్యవారే సులగ్నే
సప్తమ్యాం శ్రీవిజయనగరం నిర్మమే దేశికేంద్రః"

అను శాసనాధారమును పెద్దల వలన వినియున్నాను. ఈ శాసనస్థ విషయములు పరిశీలకులు పరిశీలింతురుగాక పై శాసనము ప్రకారము శాలివాహన శకము 1258 ధాతనామ సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమీ బుధవారము గురుని లగ్నమున గల ముహూర్తమున, గురు

నగర స్థాపనము చేసిరి. ఇందు గురువర్యులనగా మాధవులే యని యందురు. కాని యది సంప్రదాయ విరుద్ధము. ''దేశి కేంద్రే'' పదము గురువర్యులను సూచించును. తాను మాధవుల పేరుతోనే యుండిగద అనంతరము రచనలు సాగించిరి. అట్టి తటిని, తాను సన్యసించి విద్యారణ్యులైనట్లు, అందుచే గురువర్యులైనట్లు, భ్రమ పడి, విద్యారణ్యులే నగర నిర్మాణము చేసిరని చరిత్రకారులు వ్రాసిరి. కాని యది సరికాదని తోచెడిని.

తాను బుక్కరాయల రాజ్యకాలం వరకు సన్యసించక మాధవులుగనే యున్నారు. తన గ్రంథాలలో వేదభాష్యముననూ, తన గురువు విద్యాతీర్థులనియు వ్రాసికొనియున్నారు. కాన, తాను స్థాపింపబోవు మహాసామ్రాజ్య నిర్మాణమునకు, ప్రధాన నగరమును, తన గురువర్యులైన విద్యాతీర్థులచేత శంకుస్థాపనాది నిర్మాణములు చేయించినాడు గాన, ''దేశి కేంద్రః'' అను పదముచే నూహింప సమంజసముగా నున్నదని విన్నవింతును. చరిత్రకారులు పరిశోధింతురు గాక.

ఈ విద్యా నగర నిర్మాణము సప్త ప్రాకారావృతముగ, నేడు వత్సరముల కాలము పట్టినది పూర్తిజేయుటకు. కొంత ప్రదేశము, అరణ్య ప్రాంతము నిర్మానుష్యము అగు దుర్గమారణ్యమున నగర నిర్మాణము చేయడముగాన, సప్త వర్షకాల పరిమితము సమంజసమే.

క్రీ. శ. 1336 లో నగర నిర్మాణము రాజ్యపాలనాది విధులు నేర్పరిచిరి. సుమారు (8 వత్సర ) ఎనిమిది వత్సరాల కాలము హరిహరులు రాజ్యము జేసిరి. 1344 లో హరిహరులు గతించిన బుక్కరాయలు రాజ్యానికి వచ్చి దిగ్విజయాదులు సుమారు కనీసము రెండు మూడు వత్సరాలు పట్టియుండును కాన 1345 లేక 46 నాటికి వేద భాష్య రచనలకు మాధవులను ప్రోత్సహించి యుండ వచ్చునని యూహింతుమేని, 1346 లో సామంతులు మాధవ ప్రోత్సాహమున తొలుత, యజుర్వేదాంతర్గత, కృష్ణయజుర్వేద భాష్య రచనను ప్రారంభించియుండునోపును. వేదము (82) ఎనుబది రెండ ధ్యాయములుగాన, వారానికి ఒక యధ్యాయమునకు భాష్య రచనము చేసిననూ 82 వారాలు అగును కాన సుమారు రెండు వత్సరముల కాలమైన కనీసము రచనకు పట్టియుండ వచ్చును. కాన, 1348 లేక 59 నాటికి యజుర్వేదతైత్తిరీయశాఖాభాష్యము పూర్తియై యుండవచ్చు.

అనంతరము మాధవులే స్వయముగ ఋగ్వేద భాష్యానికి పూనుకొని తన రాజకార్య నిర్వహణముతో గూడ, భాష్య రచనము, ఎనిమిది యష్టకములుగల ఋగ్వేదానికి వ్యాఖ్యజేయు నెడల కనీసము మూడు వత్సరములేని పట్టియుండవచ్చు. కాన 1349 నుంచి 53 వరకు మాధవులు బుక్కరాయల మంత్రియై శాస్త్రాది గ్రంథములు కృష్ణ యజుర్వేద ఋగ్వేద భాష్యములు రచించుటకు తోడ్పటయు నుండియుండును.

అనంతరము, బుక్కరాయలు సాయణులను, సామవేదమునకు శుక్లయజుర్వేదీయ కాణ్వశాఖకు భాష్యము రచించమని కోరిరి. ఇవి రెండు కనీసము అయిదు వత్సరములైన పట్టియుండవచ్చునని భావింతుమేని 1353 నుంచి 58 లేక 1360 వరకు యుండి యుండవచ్చు. ఈ కాలమున విద్యారణ్యులుగా మాధవులు మారి యుండియు అయియుండుటకు గాని కారణములుండియుండ వచ్చునని యూహింపదగియున్నది.

అనంతరము బుక్కరాయలకు వృద్ధాప్యాదులు.మరణాదులు గల్గి యుండనోపును.

బుక్కరాయల పుత్రుడు గౌరాంబికా తనయుడు అయిన హరిహర రాయలు (రెండవ హరిహరుడు) రాజ్యానికి రావడము దేశమును. జయించు నెపమున, దిగ్విజయయాత్ర దేశపాలనము తులాపురుషాది దానాలు జరిపిన యనంతరము సాయణాచార్యులను అథర్వణ వేద భాష్య రచనము చేయుమని రెండవ హరిహరులు కోరిరి గాన, ఈ అథర్వణ వేద భాష్యమున, విద్యారణ్య స్తుతి యున్నందున, శ్రీ విద్యానగర స్థాపనము నాటికి మాధవులేగాని, విద్యారణ్యులు కాలేదనియు, శ్రీ విద్యానగర స్థాపనము, యతీశ్వరులైన విద్యాతీర్థులచే (గురువర్యులు గాన) మాధవులు: జరిపించిరిగాని, తాను సన్యాసమును స్వీకరించి విద్యారణ్యులై, స్థాపించలేదనియు విన్నవింతును. చరిత్రకారులు పరిశీలించి, లోపములను మన్నించి, సత్యాసత్యములను నిరూపింతురుగాక.

నేను వేద భాష్యమును పరిశీలించు తరిని నాకు గల్గిన సందియములను మనమున నాటికొని, మాధవుల గ్రంథాలు మరికొన్ని పరికించి, తోచిన భావాలను సహృదయ సమ్మతమగునని నివేదించినాను.

ఈ రీతిని సాయణమాధవులు, తురుష్క రాజ్యమైన దక్షిణాపథ మనదగు దక్షిణ హిందూదేశాన్ని స్వాధీనపరచుకొని, పలు మారులు పరులు వచ్చు దాడులను ఎదుర్కొని, గోవా పట్టణమును

అరబ్బుల దాడినుంచి పరిరక్షించుకొని, దేశానికి జాతికి, సంఘానికి, భాషకు, ధర్మానికి, అపూర్వము అనన్య సాధ్యము అనదగు సేవజేసిన మహనీయులని, నేడు కొది మంది మాత్రమే యెఱింగియుండుట శోచనీయము. వీరి చరిత్రము తెలియక, ఉన్న చరిత్రమేని సరిగ లేకుండుట గమనింపదగియున్నది.

వీరు జాతికి ధర్మానికి, చేసిన సేవ అపారము. సర్వులకు, అనగా అన్ని ప్రాంతములకు, తెలియదగు రీతిని సంస్కృత భాషలో వీరి రచనలు, నూరు గ్రంథాలకు పైబడి యున్నవి. వీని పేర్లు గూడ నేడు తెలియని వారెందరో గలరు. చదివేవారు చదవనివారు యెందరో? స్మృతి పథమున నుండుటకై వారి గ్రంధములను కొన్నిటిని వ్రాయుదునుగాక.

1 మనుస్మృతి వ్యాఖ్య 2 కాలమాధవీయము 3 వ్యవహార మాధవీయము 4 వంశబ్రాహ్మణ భాష్యము 5 వార్తికసారము 6 రామతత్వ ప్రకాశిక 7 లఘుజాతక వ్యాఖ్య 8 యోగవాసిష్ఠ సారము 9 యజ్ఞతంత్ర సుధానిధి 10 ముహూర్త మాధవీయము 11 మంత్రప్రశ్న భాష్యము 12 మండల బ్రాహ్మణ భాష్యము 13 భాట్ట సారము 14 బోధాయన సూత్ర వ్యాఖ్య 15 భగవద్గీత వ్యాఖ్య 16 బృహదారణ్యక భాష్యం 17 పురుషార్థ సుధానిధి 18 పురాణ సారము 19 పరాశరస్మృతి వ్యాఖ్య 20 పంచదశి వ్యాఖ్య 21 దేవీ భాగవత స్తుతి 22 దేవతాధ్యాయ భాష్యం 23 దర్శపూర్ణ మాస ప్రయోగ వివరణం 24 దర్శపూర్ణమాస భాష్యం 25 ధాతువృత్తి 26 పంచీకరణము 27 పాణినీయశిక్షా భాష్యము 28 దత్తక మీమాంస 29 దక్షిణామూర్తిస్తోత్ర భాష్యం 30 త్ర్యంబకభాష్యం 31 సంధ్యావందనభాష్యం 32 ఆరణ్యకభాష్యం 33 కృష్ణయజుర్వేద సంహితాభాష్యం 34 కృష్ణయజుర్వేదసంహితా భాష్యం 35 తిథి నిర్ణయము 36 తాండ్య బ్రాహ్మణము 37 జైమినీయ న్యాయమాల 38 వ్యాస దర్శన ప్రకాశిక 39 విద్యారత్న సూత్రభాష్యం 40 వివరణ ప్రమేయ సంగ్రహం 41 లలితా సహస్ర నామ భాష్యం 42 వైద్యనిదాన సంహిత 43 శతపథ బ్రాహ్మణ భాష్యం 44 శివగీతా భాష్యం 45 శుక్లయజుర్వేద భాష్యము 46 శ్రీ విద్యాతీర్థ దీపిక 47 షడ్వింశ బ్రాహ్మణము 48 సర్వదర్శన సార సంగ్రహము 49 సహజనామకారిక 50 సామ వేద భాష్యము 51 సామ విధాన భాష్యము 52 సిద్ధాన్త బిందువు 53 సూర్య సిద్ధాన్త వ్యాఖ్య 54 స్మృతి సంగ్రహము 55 సర్వ విగ్రహ శిక్షా భాష్యం 56 సౌందర్యలహరీటీక 57 హరిస్తుతిటిక 58 అథర్వణ వేద భాష్యం 59 అద్భుత దర్పణం 60 వైయాసిక న్యాయమాలా 61 న్యాయమాలా విస్తరం 62 అనుభూతి ప్రకాశిక 63 అపరోక్షానుభూతిటీక 64 అధినయమాధవీయము 65 ఉష టీక 66 ఆత్మానాత్మ వివేకము 67 ఉపనిషద్దీపిక 68 అశ్వలాయన సూత్ర భాష్యము 69 వేదాన్త పంచదశి 70 ఉపగ్రంథ సూత్రవృత్తి 71 కర్మకాల నిర్ణయము 72 కర్మవిపాకము 73 కల్పభాష్యము 74 కురుక్షేత్ర మాహాత్మ్యము 75 గోత్ర ప్రవర నిర్ణయము 76 జాతివివేక శత ప్రశ్న 77 జీవన్ముక్తి వివేకము 78 ఐత్యభేదము 79 ఛాందోగ్య బ్రాహ్మణము 80 చరణవ్యూహ భాష్యం 81కాఠక భాష్యం మొదలైన పేర్లతో నూరు గ్రంథముల పైని వీరివిగలవు. ఇవి సాయణులు మాధవులు ఇరువురు కలసి వాసినవి కొన్ని, కేవలము మాధవులు వ్రాసినవి కొన్ని యున్నవి. ఈ నూరు గ్రంథాలపైన నాకు తోచిన పేరు ఎనుబది 80 వరకే, వానిని మాత్రమే వ్రాసితిని. మిగతావి యెన్నియో నాకు తెలియకున్న తెలిసిన పెద్దలు వానిని తెలుప ప్రార్థన.

ఈ రీతిని మాధవులు సాయణులు దేశమునకు జాతికి భాషకు ధర్మమునకు చేసిన సేవను స్మరించు నెపమున ఈ వ్యాస రచన ముఖ్యసారమని మనవి.

పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనం॥
వేదశాస్త్రార్థతత్వజ్ఞో యత్ర తత్రాశ్రమేవసన్॥
ఇహైవలోకే తిష్ఠన్, స్వబ్రహ్మభూయాయ కల్పతే॥
సైనాపత్యంచ రాజ్యంచదండనేతృత్వమేవచ॥

సర్వలోకాధి పత్యంచ వేదశాస్త్ర విదర్హతి

అనుమను స్మృతి ప్రమాణానికి ప్రమాణ భూతులై వేదశాస్త్రములు నేర్చి రాజ్య నిర్మాణములు చేసి ధర్మమును ప్రచరించి దేశమును కాపాడి జాతి నుద్ధరించి భాషకు సేవచేసిన మహనీయులు సాయణ మాధవ విద్యారణ్యులు.

— శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మ

# గ్రంథ విమర్శలు

## చైతన్య శిఖరం

[సంపాదకుడు డా. జి. వి. సుబ్రహ్మణ్యం, వెల: 5 రూ.లు ప్రచురణ-నవోదయం, శ్రీవాణి 1-8-102/105-నల్లకుంట, హైదరాబాదు-44 (500044)]

డా. సి. నారాయణరెడ్డిగారి "మంటలూ — మానవుడూ" కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు [1973] నందుకొన్న రచన కవితా సంపుటి. దాని సదవగాహనకూ. సాహిత్య ప్రమాణాల సమాలోచనకూ చేసిన కృషి ఫలితమే ఈ "చైతన్య శిఖరం"

ఈ సమీక్షా సంకలనం సంపాదకులు "మా గురించి"...లో చెప్పినట్లు 'తెలుగులో ఆధునిక ప్రక్రియలు వెలిసినంత వేగంగా వాటినిగూర్చిన సదవగాహనంగానీ, సాహిత్య ప్రమాణాలను గూర్చిన సమాలోచనం గానీ, ప్రయోగ పరిశోధనగానీ జరగడం లేదు." సత్యం.

హాస్యాని కంటేనేం. అపహేళనగా అంటేనేం తెలుగువాళ్ళు ప్రతి ఇద్దరిలో ఒకడు రచయిత"— అనే మాట అతియోక్తి అయినా మన రచయితల సంఖ్యాధిక్యమును తెలుపుతుంది. అయినా 20 వ శతాబ్దిలో సాహిత్యకారుల పరిగణన పొందిన 'తెనుగు కథ'కు నేడా విశిష్టత లేదు. ఇరవయ్యేళ్ళుగా కృషి అత్యధికంగా సాగుతున్నా, సంఖ్య విపరీతంగా పెరుగుతున్నా మన నవల ప్రమాణాల దృష్ట్యా ఎదుగు బొదుగులు లేకుండా వుంది. కవితా రంగంలో కొంతమంది వ్యక్తుల ప్రతిభకు గర్వపడవలసిన స్థితేతప్ప విశేషం లేదు. నాటకం అదే స్థితి. ఈక్లైబ్యం ఎందుచేత ?

లబ్ధ ప్రతిష్ఠులయిన కవుల, రచయితల కావ్యాలలోని అంద చందాలు, మెలకువలు, వారు వస్తు, భావ వ్యక్తీకరణలో కనబరచిన గడుసుదనాలు, ప్రయోగ కౌశల్యాలు అవగాహన చేసుకోవడం నవ కవులకూ రచయితలకూ ఎంతో సహాయం అవుతుంది. ప్రత్యక్ష ప్రమాణాలతో అది వారికి పాఠంలా వుపయోగపడుతుంది.

అలాగే సాహిత్య ప్రమాణాల సమాలోచనం లబ్ధ ప్రతిష్ఠులకూ ప్రయోజనకారి. సమర్థులే రాసినా రాసినవన్నీ సమర్థవంతంగా వుండవు. వస్తు అవగాహనలో లోపం వుండొచ్చు, వస్తు వ్యక్తీకరణలో లోపం రావొచ్చు, అశ్రద్ధ: అహంభావం, కతిపయ విషయ జ్ఞాన లోపం ఎన్నో కారణాలుంటాయి. మనిషి సర్వజ్ఞుడు కాడు. సంస్కారానికి పరిమితు లుంటాయి, ఆ దృష్టిలోంచి ఆలోచిస్తే, సమీక్షలూ, విమర్శలూ రచయిత పెరుగుదలకే ఎంతో అవసరం.

ప్రయోగాల పరిశోధన అసలు సాహిత్యాన్నే ప్రభావితం చేస్తుంది.

అందుచేత "నవోదయ" సాహితీ సాంస్కృతిక సంస్థవారు శ్రీ నారాయణరెడ్డి "మంటలూ—మానవుడూ" కావ్య సమీక్షకు పూనుకోవడం, ఆ సమీక్షా వ్యాసాలను సంకలించి, ప్రచురించడం అభినందనీయం. ఏమంటే—

డా. నారాయణరెడ్డిగారు బహు గ్రంథకర్త, నిత్య కవితా వ్యాసంగీను.

ఆయన ఈ కవితా సంపుటి కేంద్ర సాహిత్య అకాడమీ మన్ననా, పురస్కారం అందుకొంది.

ఈ సమీక్షా సంకలనంలోని పదకొండు వ్యాసాలు వివిధ దృక్కోణాలనుంచి శ్రీ రెడ్డి కావ్యాన్నీ, కావ్యాత్మనీ, పద ప్రయోగ కౌశలాన్నీ, శబ్ద సౌకుమార్యాన్నీ, శిల్పాన్నీ, కవితలలోని ప్రత్యేకతలు, అందచందాలు, సామాజిక ప్రయోజనాన్నీ వివరించేరు. ఆయా వ్యాసాల పేర్లే ఆయా సమీక్షకులు ఎత్తుకొన్న అంశాలను తెలుపు తున్నాయి.

నామౌచిత్యం, సృజనాత్మకత లక్ష్యం, ఆధునికత, అంత ర్వ్యక్తి—అభివ్యక్తి, విశ్వజనీనత, ఇమేజరీ, సామాజిక స్పృహ, శైలి, రసావేశమూ—రమణీయ సందేశమూ, వచన కవితా కేతనం, ధ్వని కావ్యం.

వర్తమాన సమాజ పరిణామాలు కావ్య వస్తువు, వివిధ ఘటనలు కథావస్తువులు, కాని కావ్యం చాల పరిమితం కావడంచేత సమీక్షకులు చెప్పిందే చెప్తున్నారా అనిపిస్తున్నా, నిజానికి ప్రతి ఒక్కరూ ఒకే కావ్య ఖండికను తీసుకొన్నా భిన్న విభిన్న దృక్కోణాల నుంచే పరిశీలించేరనాలి. నిజంచేత వైలక్షణ్యం కోసం వికృతం చేయడం జరిగిందనాలి కొన్నిచోట్ల. 'ఉద్యోగులు, వినియోగులు' శబ్దాల వివరణలో అటువంటిది చూస్తాం.

డాక్టరు నారాయణరెడ్డి కవిగా చెలగడుసువాడు. ప్రస్తుత సమాజంలో వున్న అవ్యవస్థ ఫలితంగా మనిషి అనుభవిస్తున్న వ్యథను చాల చక్కగా చిత్రించేరు. విమర్శకులలో కొందరు తాము నారాయణ రెడ్డి గారి కవితలతో చూస్తున్న చూడదలచుకున్న కావ్యలక్షణాలకు కవితా గుణాలకు విపరీతార్థాలు కల్పించుకొని ప్రత్యేక వ్యక్తులతో కానీ, వర్గాలతోగానీ సంబంధం ఉండకపోవడం, నిన్న నేడు రేపులు లేకపోవడం, నివు నేను అన్న తారతమ్యం లేకపోవడం వంటి లక్ష ణాలు చూస్తున్నారు. కాని శ్రీ నారాయణరెడ్డి నేటి సామాజిక దుర్వ్యవస్థను, అందులో మధ్యతరగతుల జీవితంలోని అగతిక స్థితిని దానిపై అ వర్గంలోంచే వచ్చిన తిరుగుబాటు ధోరణిని (నక్సలిజం) కేవలం మధ్యతరగతి అసమర్థ, అరాజక వాద ధోరణుల పర్యవసానం తప్ప వేరుకాదు. మార్క్సిస్టు విప్లవవాదానికి అదొక పేరడీ. ఆనందం హాస్యం మాత్రం దీని విలువకాదు. అనంతత్యాగాలూ, అమూల్యమైన ఒక మహోద్యమం పెడదార్లు పట్టి విధ్వంసం కావడం దానికి చెల్లి స్తున్న విలువ గుర్తులో పెట్టుకొని మరీ వ్రాస్తున్నారనీ ఆ కవితలు చదివిన వారందరూ చెప్తున్నారు, చెప్తారు, వరా తీత రాజకీయ విమర్శలు గమనించిన పరిశీలకులే చెప్పేరు.

శ్రీ నారాయణరెడ్డిలోని మానవతావాదం మధ్యతరగతి మేధో వాది ఉదార వాదం మాత్రమే. ''నేనూ—నా తమ్ముడూ'', జోడెద్దుల కుమ్ములాట' ఈ రెండూ 1970 నాడు దేశాన్ని కలవర పెడు తున్న రెండు ప్రధాన సమస్యలు—నక్సలిజం' కాంగ్రెసు రెండుగా చీలడం—గురించి కవి హృదయాన్ని చెప్తున్నాయి. ఈ రెండింటికీ దేశం భవిష్యత్తుతో సంబంధం వుంది.

'మంటలూ—మానవుడూ, పరమహంసలారా!'—వంటివి ఆర్థిక సమస్యలూ, పోరాటాలకు సంబంధించినవి. 'అనగా అనగా ఓ రాజు, (చైతన్య ప్రగతి) వంటివి మానవ జాతి పురోగతికి ఆశాభావం చూపేవి. అక్కడ కవికి కావలసింది సహృదయత.

కాని, ప్రత్యక్ష దేశ రాజకీయాల సమస్య వచ్చేసరికి సహృద యత ఒక్కటేచాలదు. సదవగాహన సమస్య అవగాహన కూడ కావాలి.

కాలభుజంగం కాటుతిన్నవాడు
కసిపెంచుకోక ఏం చేస్తాడు?
............
రాజీపడే అవసరం ఇద్దరికి లేదు
రస్తాలు వేరని చాటుతున్నాను.
............
దురంతపద్మవ్యూహాలవల్లకానిది
రవంత అనురాగంవల్ల ఔతుంది.

—ఇదీ ''నేనూ— నా తమ్ముడూ'' కవితలో శ్రీ నారాయణ రెడ్డి శ్రీకాకుళం (నక్సలిజం) ఘటనల యెడ చూపిన దృక్పథం.

అ కవిత చదవగానే ''రవంత అనురాగం'' కనబడకనే నా కాల సర్పం కాటు'' వేస్తే?—అనిపించింది. ఆ ప్రశ్నకు నారాయణరెడ్డి గారేనా ''జ్ఞానం''టారా? అనగలరా? అసంభవం!

అంతేకాదు.

మా ''రస్తాలు వేరని చాటుతున్నాను'' అనడంలో కవి తమ్ము నిది కూడా రాస్తాగా అంగీకరిస్తున్నారనాలి.

ఇరుగు పొరుగులు వేధిస్తున్నారని ఆత్మహత్య చేసుకోడం

ఒక రాస్తా అనేటయితే శ్రీకాకుళం వీరులదీ ఒక రస్తాయే. ఇక్కడ సమస్య హింస—అహింసలది కానే కాదు. ఇదొక సామాజిక సమస్య.

శ్రీకాకుళం వీరులుగాని, కవి అన్నగారు కాని కోరుతున్న దేమిటి? ప్రజానీకానికి ప్రస్తుత వ్యవస్థ బాధాకరంగా వుంది. దానిని నిర్మూలించాలి. బాగుంది.

ఇక్కడ వేయవలసిన ప్రశ్న వేరు. ఇది వైయక్తిక సమస్యా, సామాజిక సమస్యా ?

వైయక్తిక సమస్యకోసం కసీ, క్రౌర్యం చూపుతే ఆతడొక వట్టి సాధారణ హత్యాకారి మాత్రమే. అటువంటి పరిస్థితిలో కవి "దురంత పద్మవ్యూహాల వల్ల కానిది, రవంత అనురాగంవల్ల అవుతుంది"—అని హితబోధ చేయగలడు కాని "రస్తాలు వేరని" చాటలేడు.

తనకు కలిగిన నష్టానికో, కష్టానికో ప్రతీకారం చేసే వ్యక్తి ప్రజల సానుభూతి, సహాయాలు కోరలేడు. వాళ్లు ఇవ్వరు. ఎన్ని ఆదర్శాలు వల్లించినా అతడు వట్టి హంతకుడు.

అలా కాదు. అది సామాజిక సమస్య అంటారూ. దానిని సామాజిక పద్ధతిలోనే పరిష్కరించండి. సామాజికమైన పనిని వైయక్తిక పద్ధతిలో చేయబోతే ప్రజలు మీతో వుండరు. ఒకవేపున మీరు పరిష్కరించబోయిన సమస్య, రెండోవేపున వారికి వత్తాసుగా పాలనా వ్యవస్థ మిమ్మల్ని అడకత్తెరలో పెడతాయి.

అంతే కాదు. విశ్వమానవప్రేమ ప్రబోధాలూ, ప్రహ్లాద కథ మొదలైన పాఠాలూ ఉగ్గుపాలనుంచీ నేర్పి, నిత్యసత్యాలూ, మానవ విలువలూ అంటూ భజనలు చేయించిన మన 'సంస్కారం' మూడోవేపునుంచి దెబ్బతీస్తుంది. అసలు విషయాన్ని ఆలోచించ నివ్వదు.

డాక్టరు నారాయణరెడ్డిగారి కవిత ఈ మూడోస్థానం తీసుకొంది. ఇది ఆయన ఎరిగి చేసిన పనికాదు. మధ్యతరగతి మేధోవాదుల ఉదారవాద దృక్పథం తెచ్చిన అనర్థం యిది.

అలాగే "జోడెద్దుల కుమ్ములాట."

1969 లో రాష్ట్రపతి పదవి పోటీలో శ్రీ వరాహగిరి వెంకట గిరిని నిలపడమా, శ్రీ నీలం సంజీవరెడ్డినా అనే సమస్య మీద కాంగ్రెసులోచీలిక వచ్చింది. ఈ చీలిక వ్యక్తిగత అసంతృప్తులూ, కక్షలూ, కావేషీలా ఫలితంకాదు, నిర్దిష్ట కార్యక్రమాన్ని బలపరచడం, తిరస్కరించడం దీనికి వెనకనున్న కారణం. చీలిక ప్రారంభంముందు ఈ విషయం అస్పష్టంగావున్నా 1970 నాటికి స్పష్టపడింది.

దీని అర్థం కాంగ్రెసు అభ్యుదయవాదులూ, తిరోగమన వాదులూగా విస్పష్టంగా విడిపోయిందని కాదు. చీలిక తరవాత కూడా అభ్యుదయ వాద భాగంలో ఎందరో తిరోగమనవాదులు మిగిలిపోయేరు. మన రాష్ట్రంవరకు జై ఆంధ్ర ఉద్యమంలో వారం దరిస్వస్వరూప జ్ఞానం మనకు కలిగింది. ఈవేళ జయప్రకాశ్ సమగ్ర విప్లవ ఘట్టంలో, అలహాబాద్ హైకోర్టుతీర్పు (ఇందిరాగాంధీ ఎన్నిక కేసులో) ఘట్టంలో ఆనాటి సంఘర్షణ తరవాయిని చూస్తున్నాం.

ఆ సంఘర్షణ (1969) దేశానికి నష్టకరమా ? లాభకరమా ?

స్థూలంగా లాభం కలిగించింది. సమాజాన్ని వెనక్కిపట్టి వుంచాలనే దృక్పథంగలవారిచేతిలోంచి ప్రభుత్వాధికారం తొలగింది. సామాజికీ కరణం, భూసంస్కరణలు, అంతర్జాతీయంగా పోషలిస్టు అభ్యుదయకర వర్గాలతో చెలిమి కోరేవారు, మనలాగే స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న జాతులయెడ సానుభూతి చూపగల కాంగ్రెసు వాదవర్గం కేంద్రంలోవుంది.

అందుచేత ధాన్యం బండి నడిబజారులో వొరగలేదు. విరిగిన కాడి మెడలమీథ మిగలలేదు. ఇది కేవలం అన్నదమ్ముల జ్ఞాతివైరంగా, జోడెద్దుల కుమ్ములాటగా చూచిన అవగాహనలోపం.

ఇదీ మధ్యతరగతి మేధోవాదుల ఉదార వాదదృక్పథం తెచ్చిన అనర్థమే.

సమాజం వర్గాలుగా విడిపోయివున్నప్పుడు విశ్వజనీనత. విశ్వ

## గమనిక

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు సమీక్ష చేసిన గ్రంథం పేరు "శ్రీ రామాయణ సారకావ్య తిలకమ్" అని ఉండాలని గమనించగోరుచున్నాము. (సం.)

మానవతలను పూర్తి శబ్దార్థంతో వుపయోగిస్తానంటే సమాజ సూత్రాల చేతిలోవున్నవాళ్ళు సెభాష్ అనవచ్చు. కాని ఆ సూత్రాలు కంఠాల కురిత్రాళ్ళుగా బిగుస్తున్నవాళ్ళు ?

శ్రీ నారాయణరెడ్డి కవితలలో సామాజిక దృష్టి వుంది. భావుకతవుంది. చమత్కారంవుంది. శబ్ద సౌరభం వుంది. అన్నీతోపాటు అంచుకు తొగరువంటి సమాజ సమస్యల సమ్యగవగాహనకూడావుంటే!

అప్పుడాయన వుదారవాదిగా వుండరు. విప్లవ వాదే అవును.

—అవంతి.

## సంక్షిప్త వర్ణనాత్మక సంస్కృత వ్యాకరణము

మొదటి భాగము. గ్రంథకర్త. డాక్టర్ బేతన భట్ల విశ్వనాధము, ఎం. ఏ. పి. హెచ్‌డి, రిటైర్డ్ ప్రొఫెసర్, గణితశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. డెమ్మీ 18+210 పుటలు. వెల 10 రూ. ప్రకాశయిత్రి—శ్రీమతి బేతనభట్ల పద్మాలయ; 1–2–333/G. గగన్‌మహల్ రోడ్, హైదరాభాదు–29.

వేదార్థావగతికి అవసరమైన ఆరు వేదాంగాలలో వ్యాకరణం ఒకటి. ఇది వేదానికి ముఖమని ('ముఖం వ్యాకరణం స్మృతమ్') అని చెప్పబడినది. అట్టి సంస్కృత వ్యాకరణాలలో ప్రాచీనమై బహుళ ప్రచారంలో ఉన్నది పాణినీయ వ్యాకరణం. ఇది ఎనిమిది అధ్యాయాలలో ముప్పయిరెండు పాదాలలో సూత్రరూపంగా ఉన్నది. పాణిని రచించిన యీ సూత్రాలకు వరరుచి వార్తికములు, పతంజలి మహాభాష్యమూ ఉన్నవి. ఈమూడూ కలిసి, లౌకిక, వైదిక వాఙ్మయాలకు సమగ్రమైన లక్షణంగా ప్రసిద్ధికెక్కాయి.

పాణినీయ వ్యాకరణాన్ని గురించి ప్రస్తుత గ్రంథ భూమికలో ప్రస్తావిస్తూ డాక్టర్ బి. ఆర్. శాస్త్రి గారు "సూక్ష్మపర్యాలోకనము, ప్రయోగములను సేకరించుట, విభజనము. వర్గీకరణము (ధాతుగణపాఠాదులు), సాదృశ్య వైదృశ్యముల గుర్తింపు, ఉదాహరణ ప్రత్యుదాహరణములు, విశ్లేషణము, సంశ్లేషణము, శబ్ద పరిణామము, పరిణామహేతు వివరణ, ఉత్సర్గాపవాద నియమనము, సూత్రీకరణము, ప్రదేశకాల భేదములనుబట్టి భాషాభేదగణన, ఐతిహాసిక దృష్టి, (భాషాయాం, ఛందసి) ఉచ్చారణ, ఉచ్చారణ భేదమువలన అర్థములో కలుగు భేదము సమగ్రత, స్పష్టత, సంక్షిప్తత—ఇవి అష్టాధ్యాయిలో పదే పదే మనకు కానవచ్చు ప్రక్రియ" అని దీని వైశిష్ట్యమును వివరించి యున్నారు.

ఇట్టి వ్యాకరణాన్ని గురువుల మూలంగా అభ్యసించే పద్ధతియే ప్రాచీనకాలంనుండి వస్తున్నది. లేకపోతే అది సులభగ్రాహ్యం కాదు. కాని, గత శతాబ్దం చివరిభాగంలో ఖండాంతరాలలో ఉద్భవించి, దినదినాభివృద్ధిని పొందుతున్న ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులలో ఏ భాషనైనా సులభంగా నేర్చుకొనే వరనా పద్ధతు లేర్పడినవి. అవి విదేశ భాషలలోనే ఉన్నవి. తెలుగులో అట్టి గ్రంథాలు లేవు. సంస్కృతభాషతో శ్రద్ధాసక్తులు గలవారి ఉపయోగార్థమై ఈ సంక్షిప్తవర్ణనాత్మక సంస్కృత వ్యాకరణం రచించబడింది.

దీనిని రచించిన డాక్టర్ విశ్వనాధంగారు గణితశాస్త్రంలో ఆచార్యపీఠం అలంకరించి ఎందరో విద్యార్థులను ఆ శాస్త్రంలో ప్రవీణుల నొనర్చిన ప్రతిభావంతులు. గణితదృష్టితో సంగీతంలో సాధనచేసి, వైణికులై, స్వరసాన్నిహిత్యంతో వేదస్వరాల పుట్టు పూర్వోత్తరాల పరిశీలనకు పూనుకొని, దానివల్ల కలిగిన ఆసక్తిలో వైదిక లౌకిక వాఙ్మయాలలోనూ, వ్యాకరణంలోనూ గొప్ప కృషిచేసిన విద్వాంసులు! ఇట్టి బహుముఖ ప్రజ్ఞా పరిశీలనలుకల వీరు ఈ వ్యాకరణ రచనకు పూనుకొనుట సముచితంగానే ఉన్నది.

'వృద్ధిరాదైచ్' అనే సూత్రంతో ప్రారంభమై, 'ల ఆ' అనే సూత్రంతో అంతమైన అష్టాధ్యాయికి గణితంలో ఎక్కువ

సంబంధం ఉన్నది. అధికారములు, మండూకప్లుతులు, సపాద సప్తాధ్యాయి, త్రిపాది విభజన మున్నగువాటినిబట్టి ఈ విషయం తెలుసుకోవచ్చును. ఒక్కొక్క రూపసాధనకు వేర్వేరు అధ్యాయాల సూత్రగవేషణను బట్టికూడా దీన్ని గ్రహించవచ్చును. గణిత శాస్త్రాచార్యుల కీ వ్యాకరణ రచనపై ఇందువల్లనే ఆసక్తి కలిగిందేమో!

నూతన పద్ధతిని రచింపబడిన యీ వ్యాకరణంలో పన్నెండు అధ్యాయాలు, రెండు అనుబంధాలు ఉన్నవి. మొదటి అధ్యాయంలో వర్ణమాల, ధ్వనులు, ఉచ్చారణ, స్వరములు, రెండవ అధ్యాయంలో సంధి, మూడవ అధ్యాయంలో అజంత శబ్దాలు, నాల్గవ అధ్యాయంలో హలంతశబ్దాలు, అయిదవ అధ్యాయంలో సర్వనామములు వివరింపబడినవి. ఆరవ అధ్యాయంలో క్రియాసామాన్య విషయాలు–వర్గీకరణ, భావార్థకాలు, అసమాపకక్రియ, క్రియాపదస్వరము మొదలైనవి కలవు. తర్వాతి నాలుగధ్యాయాలూ క్రమంగా వర్తమాన, పరోక్షభూత, భవిష్యత్, అద్యతన భూతకాలాలను వివరిస్తున్నవి. పదకొండవ అధ్యాయం క్రియాజన్య విశేషణ, విశేష్యాలనూ, చివరి అధ్యాయం క్రియల గౌణప్రక్రియను వివరిస్తున్నవి.

మొదటి అనుబంధంలో వాఙ్మయానికి మూలములని చెప్పదగిన ప్రధాన ధాతువుల పట్టిక అర్థాలతో కూడా ఇయ్యబడినది. రెండవ అనుబంధంలో వేదములోని స్వరాల వివరణ కానవస్తున్నది. సంగ్రహ వ్యాకరణాలలో సాధారణంగా కానరాని స్వరవిషయం ఉండడం ఇందలి విశిష్టతలో ఎన్నదగినది. స్వరాల మార్పిడినిబట్టి అర్థాలు మారిపోతూ ఉంటాయి. బహువ్రీహి సమాసంతో మొదటిపదంపైనే ఉదాత్తస్వరం ఉంటుంది. తత్పురుషలో రెండవ పదంపైని ఉంటుంది. అందువల్లనే "ఇంద్రశత్రు ర్వర్ధస్వ" అనేటప్పుడు "ఇంద్రః శాతయితా యస్య సః" అనే అర్థం వచ్చేటట్లు బహువ్రీహితో ఉదాత్తస్వరాన్ని తొలిపదంపై ఉంచి, ఉచ్చరించి యాజకులు వృత్రాసురునికి విరుద్ధంగా ఇంద్రునికి అనుకూలంగా హోమం చేసి, అతని సంహారానికి మార్గదర్శకులైనారు. ఇట్టి ఉదాహరణల వల్ల స్వరానికి గల ప్రాధాన్యం వ్యక్తమౌతున్నది.

ఈ వ్యాకరణం పెక్కు విధాలుగా తన ప్రత్యేకతను వెల్లడిస్తున్నది.

సంస్కృత భాషలో కొంత ప్రవేశముండి, వ్యాకరణంపై ఆసక్తికలవారి కిది ప్రోత్సాహకరంగా ఉంటుంది. తెలుగులో వైదిక, లౌకిక సంస్కృతములను తులనాత్మకంగా అధ్యయనం చేయదలచిన వారికి ఈ వ్యాకరణ గ్రంథం మిక్కిలి ఉపయుక్తంగా ఉంటుంది. సుప్రసిద్ధ విద్వాంసులు డాక్టర్ బి. బి ఆర్. శాస్త్రి, శ్రీ తిరుమల–రామచంద్ర, శ్రీ చర్ల–గణపతిశాస్త్రిగార్లు దీనిని ప్రశంసించడమే దీని ప్రత్యేకతను వెల్లడిస్తున్నది. రచయిత వ్యాకరణమున చేసిన ప్రగాఢ పరిశ్రమ మిక్కిలి మెచ్చదగినది. తక్కిన భాగాలు కూడా శీఘ్రంగా వెలువడగలవని ఆశిస్తున్నాను.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M123 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | CI, 8c1, |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | naveena |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |